# అంగీకృతి.

(:o:)

శా. ఇమ్మాడ్కిన్ బ్రచురింపఁజూతురిపుడే ♦
న్నే నాటకాల్నూత్నకా
వ్యమ్ముల్నవ్యకవిత్వసంశ్రితము లా ♦
హా ! నాటకాంతమ్ కవి
త్వమ్మంచున్మను బెద్దలన్న పలుకు ♦
ల్వమ్మయ్యెఁగా నాటకా
ద్యమ్మైనన్గవితాకుమారి రసబా ♦
హ్యాంబౌటకబ్రంబొకో.

శా. ఓమిత్రంబ ! యదెట్టులున్న భవదీ ♦
యోత్కంఠమీడేరఁగా
నా మూలాగ్రముఁజూచినాఁడ రమణీ ♦
యంబుల్ భవత్పుష్పవే
శీమోదాకర రుక్మిణీపరిణయో ♦
న్మీల ద్వచోవైఖరుల్
శ్రీ మేధానిధి నీకొసంగుత యశ ♦
శ్శ్రీవైభవోన్మేషముల్.

ఇట్లు,

నాదెళ్ల మేధాదక్షిణామూ

# ఈనాటకమునందు వచ్చు పాత్రములు.

:o:

సుప్రకాశుఁడు—కథానాయకుఁడు.

సునీతి—కథానాయకుని మిత్త్రుఁడు.

కీర్తివర్మ—మాళవదేశపురాజు.(కథానాయకునితండ్రి)

నీతిజ్ఞుఁడు—మాళవరాజునొద్దమంత్రి.

పుష్పరథుఁడు—చోళదేశపురాజు(కథానాయికతండ్రి)

విశారదుఁడు—చోళదేశపు రాజునొద్దమంత్రి.

అచలుఁడు—ఒకఋషి.

శివశర్మ } ఇద్దరు బ్రాహ్మణులు.
దేవశర్మ }

విష్ణుమూర్తి.

ప్రతీహారి.

## స్త్రీలు.

పుష్పవేణి—కథానాయిక.

సుశీల—కథానాయిక తల్లి.

ప్రియంవద—కథానాయిక చెలికత్తె.

# ప్రకటన.

పూజ్యులగు చదువరులారా !

ఎంతకాలమునుండియో నాకు ప్రాచీన కాంతామణుల సచ్చారిత్రములనేరి నాటకములుగా వ్రాసి పూర్వకాలము నాటి యువతుల మాహాత్మ్యంబులను పాతివ్రత్య ప్రభావములను బాలికల కుపయోగకరములుగా వెల్లడి చేయవలెననెడి కోర్కె యొక్కటుండెడిది. తరువాత నామిత్త్రిలును తుని గవర్నమెంటు హిందూబాలికా పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు ముదిగంటి లక్ష్మీనృసింహంగారు కూడ నన్ను పలు విధములుగా హెచ్చరించి తమవద్దనున్న శ్రీభక్తవిజయమను పతివ్రతాచరిత్రమును నాకొసంగిరి. నేనది యంతయుఁ జదివి పుష్పవేణీదేవి ప్రభావమనుకథ నాకత్యంతానందము గొల్ప నప్పుడే దానిని వ్రాయ మొదలిడి మాసత్రితయములోపల ముగించితిని. సాధ్యమైనంతవరకు బాలికలకు వలయు పాతివ్రత్యము, నిర్మలమైన జ్ఞానము, చక్కని వేదాంత బోధయు కలిగియుండు నట్లుగ క్లుప్తీకరించి వ్రాసితిని. మరియు కోలాటపు పాటలును, మార్చింగ్ పాటలును, మంగళహారతులును, నాటకమునకు సంబంధించిన యితర పాటలును సర్వజనోపయోగకరముగా విశదముగా వ్రాసితిని. గావున బాలికాపాఠశాలల

కుపయుక్తముగానే యుండును. మరికొన్ని చరిత్ర లిట్లే వ్రాయవలెననెడి కోరికె కలదు. ఈశ్వరాజ్ఞ యెట్టిదోకదా! నాకీ విషయమున ప్రోత్సాహమును గల్గించి తమ పాఠశాలా బాలికలచే నీనాటకమును బహుమతు లొసఁగఁబడు దినమునఁ బ్రదర్శనముఁ జేయించి నాయందుదయఁజూపిన నాస్నేహితులగు వేదమూర్తులైన సోంభొట్ల వేంకట్రామయ్యగారి కనేక వందనము లర్పించుచుంటిని. మరియు నాపొత్తము నచ్చొత్తింపించి నన్నుఁ గృతార్థునిఁజేసిన నామిత్త్రులగు మద్దుల వేంకటచిన్నరాజ శ్రేష్ఠిగారియెడ నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈశ్వరుఁడు వారిని నిరంతరము బ్రోచుగాక. అయ్యలారా! అమ్మలారా! బాలికలారా! గ్రంథమును మీచేతఁ బెట్టితి. బాలుఁడనై విద్యార్థినై యున్న నావ్రాతయందు తప్పులు కుప్పలుగా నుండవచ్చును. ఆదిద్దుబాటు విధమును నాకే వ్రాయించిన యెడల తమపేరుఁ జెప్పికొనుచు దిద్దికొనెద. ఇందలి పాటలన్నియు నాటకాంతమున నెంబరుప్రకారముగా నుదహరింపఁబడి యున్నవి.

ఏలూరు.　　　　　　　　　　ఇట్లు.

2—5—18　　　　　　　　　గ్రంథకర్త.

# తప్పొప్పుల పట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| గురుస్తుతిలో | | | |
| 1 | 15 | చారిత్ర | చారిత్ర్రి |
| 2 | 3 | పూరుషో | ఁబూరుషో |
| పంచరత్నములు. | | | |
| 1 | 3 | సభ్యుడై | సభ్యుఁడై |
| 1 | 3 | నిచ్చెగా | నిచ్చెఁగా |
| 1 | 6 | యనుచుడా | యనుచుఁడా |
| 1 | 14 | స్వాంతమందు | స్వాంతమందుఁ |
| 1 | 16 | చుచిర | చుఁజిర |
| 2 | 3 | ర్యానకుఁడా | ర్యానకుఁడాఁ |
| 2 | 4 | పుత్ర | ఁబుత్ర |
| 2 | 4 | బాచుపు | బాచుఁబు |
| 2 | 7 | మాన్యుడై | మాన్యుఁడై |
| 2 | 12 | సిజేసి | నిఁజేసి |
| 2 | 11 | చుగాత | చుఁగాత |
| ప్రస్తావనలో | | | |
| 3 | 8 | ధారణముచే | ధారణముఁజే |

| | | | |
|---|---|---|---|
| 3 | 41 | మఱిపించు | మఱపించు |
| 4 | 13 | స్వాంతముగా | గొంతవరకు |

నాటకములో

| | | | |
|---|---|---|---|
| 2 | 10 | మిక | మింక |
| 11 | 9 | జేలోప | జాలోప |
| 11 | 10 | నిశ్చంయించి | నిశ్చయించి |
| 12 | 4 | చూండుడు | చూడుండు |
| 21 | 15 | కిచ్చ | కిచ్ఛ |
| 22 | 21 | ప్రవాహమునకష్టు | ప్రవాహమున కీర్ష్యగుం[దష్టు |
| 25 | 15 | చిత్ర | చిత్త |
| 29 | 7 | విష్ణుండే | విష్ణుడే |
| 29 | 21 | ట్టినకుం | ట్రినంగు |
| 34 | 15 | కొక్కృత | కొక్కృత్తె |
| 41 | 3 | ఈమెయేనా | ఈమెయేయా |
| 44 | 2 | ములసు | ములను |

ఈ నాటకాంతమున చెన్నపురి ఆంధ్రవిద్యానిధి సంఘమును గురించియు, ఏలూరు, హిందూ యువజనసంఘమును గురించియు, ఏలూరు, అన్నవస్త్ర వైద్య విద్యాదాన సమాజమును గురించియుగల ప్రకటనలు దయచేసి చూడుడు.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః

# గురుస్తుతి.

---:o:---



వరపద్మాసన ఋ
ష్యావళినుతభవవిదార ♦ యమలచరిత్రా
దేవాదక్షిణదేహా
భావాతీతస్వరూప ♦ పావనరూపా.

సీ. శ్రీ శివపంచాక్ష ♦ రీ రామమంత్రంబు
లోపికనుపదేశ ♦ మొసఁగెనెవరు
నిరతంబునాయందుఁ ♦ గరుణతోవర్తించి
విద్దెబుద్ధులనేర్పు ♦ విబుధులెవరు
సరసకవిత్వంబు ♦ పెరవారుమెచ్చఁగ
నల్లగనేర్చిన ♦ యధికులెవరు
వేదాంతశాస్త్రమున్ ♦ విపులంబుగానేర్చి
ముదమునఁజెలఁగిన ♦ సదయులెవరు
ధరణినెవ్వనిచర్యలు ♦ దలఁచుచుండ
బాపసంఘంబులన్నియుఁ ♦ బాయునట్టి
సిద్ధచారిత్రు లక్ష్మీనృ ♦ సింహుజనకు
మనమునందుదలంచి న ♦ మస్కరింతు.

తే. గీ. కవనసాహిత్యపటిమము ♦ లలనన్ను
వర్ధిలంజేయు నాదెళ్ల ♦ వంశచంద్రు
పూరుషోత్తమకవివర్యుఁ ♦ బుణ్యపురుషుఁ
భావమున నెంచి మ్రొక్కెద ♦ భక్తిమీఱ.

మ. కరమామోదముతోడ బాల్యమున న
న్గాపాడుచున్నాయెడన్
గురువై యగ్రజుఁడై మహాత్ముఁడయి నా
కోర్కెల్ సదా తీర్చుచున్
పరమప్రీతిని బ్రోచునట్టి ఘనునిన్
బాండిత్యసంయుక్తు నే
మరకంగొల్చుచునుండువాఁడ శివ రా
మబ్రహ్మముల్ సద్గురున్.

తే. గీ. షడ్గుణంబులకున్నిధి ♦ సౌమ్యమూర్తి
సరసుఁడల్లదర్భావంశ ♦ శశధరుండు
అనుపమూర్తి శ్రీనారాయ ♦ ణాఖ్యుఁడైన
భావుకునకునర్పించెద ♦ వందనముల.

తే. గీ. అంకితంబిచ్చితినినిష్క ♦ శంకుఁడయిన
నాదుజనకునకీచిన్న ♦ నాటకమును
సచ్చిదానందమయమూర్తి ♦ సర్వమయుని
శ్రీధరుని దివ్యమూర్తిలోఁ ♦ జేరివారి
యాత్మ వెల్గొందుగావుత ♦ యవనిలోన.

---

మద్దుల వేంకట చిన్నరాజాభ్యుదయ స్తవ

# పంచరత్నములు.

ఉ. ఇమ్ముగ నన్నవస్త్రముల ♦ నిచ్చియు బీదలఁ గావఁగోరి తా
సమ్ముదమానసుండగుచు ♦ సత్వరమచ్చటియన్నదాన సం
ఘమ్మున సభ్యుఁడై తనరి ♦ గౌరవమొప్ప ధనంబు నిచ్చెగా
నమ్మహితాత్ము నెన్నఁదర♦మాయిల వేంకటచిన్నరాజునిన్.

క. గోసంరక్షణ యేమన
కీసమయంబునను జేయఁ ♦ గీర్తియనుచు దా
గోసంరక్షణ సమితికి
వాసిగ ధనమిచ్చి యందె ♦ వరయశస్ఫారా.

తే. గీ. ధరణివిద్యాభివృద్ధి క ♦ ర్తవ్యమనుచుఁ
బెద్దలన్నట్టిపల్కుల ♦ వినుచు నాతఁ
డల్ల మద్రాసు నాంధ్ర వి ♦ ద్యానిధికినిఁ
బోషకుండయ్యె భూజనుల్ ♦ పొగడునట్లు.

తే. గీ. అవనిజనసంఘములకు గ్రం ♦ థాలయములె
చాలనుపయుక్తములనుచు ♦ స్వాంతమందుఁ
దలఁచి తాను గ్రంథాలయం ♦ బులకు సభ్యుఁ
డగుచు చిరతరసత్కీర్తి ♦ నందెనౌర.

సీ. శ్రీలతో వర్ధిల్లి ♦ శ్రీబసవేశ్వర
పౌత్రుఁడై యెవ్వాఁడు ♦ వరలియుండె
ఏమహామహుఁడిల ♦ రామయ్యార్యునకుఁ దా
పుత్రరత్నంబౌచు ♦ పుట్టియుండె
ధర ధర్మకార్యత ♦ త్పరుఁడౌచు నెవ్వాఁడు
చిరకీర్తిని గడించి ♦ చెలఁగియుండె
మాన్యుడై యెవ్వాఁడు ♦ మద్దులవంశాబ్ధిఁ
బూర్ణచంద్రుండయి ♦ భూరియశముఁ

బొంది వైశ్యవంశమునకు ♦ భూషణమయి
గౌరవము నొందియున్నట్టి ♦ సారగుణుని
ఘనుని వేంకట చిన్నరా ♦ జును శివుండు
శ్రీయుతుని జేసి వేగ ర ♦ క్షించుగాత.



# సంగీత పుష్పవేణీ నాటకము.

## ప్రస్తావన

రంగము:— హేలాంపురిలో నొకవీధి

(కాంతిమతి, శారద యను నిద్దరు బాలికలు)

ప్రవేశము

.— శారదా? ఎక్కడికంత తొందరగాఁ బోవుచున్న దానవు?

.— వత్తు వేని నీవు కూడా రమ్ము. ఆవల వేళమించును.

.— ఓసీ! కారణముఁ జెప్పక యేతొందర పెట్టెద వేల? ఎక్కడి కేగుచుంటివి?

.— మనయూరిలోని గవర్నమెంటువారి హిందూ బాలికా పాఠశాల కేగుచున్నాను.

.— అక్కడి విశేషము లేమి?

— ఈరోజున నుపాధ్యాయులు బాలికలకు బహుమతులను పంచిపెట్టుదురు. స్త్రీవిద్యను గురించి ఉపన్యాసము లీయఁబడును తదనంతరము పతివ్రతాతిలకమగు నొక్క నారీరత్నము యొక్క చరిత్ర రూపకముగా బాలికలచేఁ బ్రదర్శింపఁబడును.

కాం——ఏమి! నాటకమా?

శార——అవును నాటకమే. ఏమంత విస్మయపడుదువు?

కాం——ఎందులకును లేదు ఎట్టులెట్టులో తలయెత్తుచున్న మన స్త్రీవిద్య మరల నాశనమునకు వచ్చు సమయము తటస్థించె నేమోయని.

శార——అదేమే అట్లంటివి?

కాం——మన పెద్దలందఱు కాంతలకు విద్యఁ జెప్పింపఁ గూడదనియు "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" యనియుఁ బల్కినారు. అట్లు పల్కినను ఎట్లో మన నవీన నాగరిక శిఖామణులు కొందఱు మన స్త్రీజనము మీఁద దయతోఁ బాఠశాలలం బెట్టి విద్యఁ జెప్పించి పాటుపడుచున్నారు. కాని ఇఁక మీఁద వేశ్యలవలె రంగస్థలమెక్కి యభినయించుచు నాటకమాడిన బాలికలను వారు గాంచిన యెడల నీయున్న గోడు కూడ చెడు నేమోయని తలఁచుచుంటిని.

శార——పూర్వకాలము నాఁటి పెద్దలందఱు స్త్రీవిద్య వలయునని యే వాదించిరి గాని యీ మధ్యకాలము నాఁటివారు కొందఱనగా సుమారు రెండువందల సంవత్సరముల దగ్గరనుంచి స్త్రీవిద్య కూడదని ప్రారంభించినారు కాని అందులకుఁ గారణభూతులు మన యాఁడువాండ్రే.

కాం——అదెట్టులో తెలియఁబల్కుము ?

శార——ప్రాక్కాలము నాఁటి యువతీమణు లున్నతకులస్థలగు కాంతలన్ని విద్యలయందును గొప్పవారై యభినయశాస్త్ర

వేత్తలైనట్లు మహర్షి విరచితములగు బా
ప్రమాణములు. చక్రవర్తుల
పాత్రధారణముఁ జేసి తమ భర్త
నట్లు కాళిదాసుఁడు శ్రీహర్షుఁడు వ
వ్రాసిననాటకములయందుఁ బ్రమాణములు
న్నవి. ఏదియెట్లున్నను వారందఱుశీలము, ప్రతిభ
నిర్వాహకత్వము, శాంతి మొదలుగాఁగల సద్గుణసం
లిగిపాత్రధారణముఁ జేసినగుణగ్రాహకలైరి. ఇప్పు
నో తెలుఁగుమీఁటిపోయినది. మనయాఁడువాండ్ర చదు
వంతయు శరీరమందు మంచిభాగమెంతయున్నను బుండు
మీఁదనె వ్రాలు మక్షికములను మఱిపించుచున్నవి. విశే
షించి దోషగ్రాహక లగుచున్నారు. కుంతీదేవి ముగ్గురు
మగలకు బిడ్డలను కనెనా లేదా యని యెంచువారే కాని
త్రిమూర్త్యాత్మక స్వరూపుఁడును భగవానుఁడునగు భాస్క
రుఁడు ప్రత్యక్షమను సంగతినెఱుంగరైరి. సత్యభామ మగ
నిని వామపాదంబునఁ దన్నెనా లేదాయని ప్రశ్నించు
వారేకాని నరకాసురునితో రణమొనర్చి శ్రాంతుఁడై
యున్న భర్తను సేదదీర్చి యామెచూపిన నిర్వక్ర పరాక్ర
మము, భర్తకొనర్చిన మహోపకారమును గుర్తెఱుంగరైరి.
ఇదంతయు యోజించియే పెద్దలందఱు నాఁడుదానికి విద్యఁ
జెప్పించినఁజెడిపోవును గనుక స్త్రీవిద్యకూడదని గర్హించి
రి. ఈచేటంతయు మనయాఁడువాండ్రు స్వయముగఁ దెచ్చు
కొన్నదే. కాని మగవారలయందు దోసమెంతమాత్ర

మనూ లేదు. ఇకనైన మన హిందూయువతులందఱు ప్రాచీన గ్రంథములందును నవీనగ్రంథములందును రసగ్రహణముం జేయుచు సుగుణము నేగ్రహించి పతివ్రతలై పూర్వకాలమునాంటి సతీమణులవలె ఖ్యాతి కెక్కుదురుగాక.

కాం—సరిగాని యీనాటక మెవ్వరు రచించిరి?

శార—నోటీసును జూడలేదా? బృందావన పురవాసియుం గేతవరపు వంశపయః పారావార రాకాసుధాకర లక్ష్మీనృసింహాచల సద్గురుపుత్త్రుండును వేంకమాంబాగర్భశుక్తి ముక్తాయమానుండును బండితజనవిధేయుండునగు రామకృష్ణునిచే రచింపంబడియె.

కాం—ఈ కవి తుని మహారాణీగారి సంస్కృత పాఠశాలయందుండువాఁడటే.

శార—అగును సంగీతశాస్త్రమును బాంతముగా నధ్యయనమును జేసి వ్యాకరణముఁ జదువనెంచి యటఁ బ్రవేశించి స్త్రీవిద్యాభిమానియై మనయూరి కరుదెంచి తానీ నాటకమును స్వయముగ రచించి బాలికలకు నేర్పినాఁడు.

కాం—గ్రంథకర్త స్వయముగ నేర్పియుండుటచే బాగుగనే యుండవచ్చును. నాటకము పేరేమి?

శార—పుష్పవేణియను నాటకము.

కాం—అట్లయిన రమ్ము పోదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)



# సంగీత పుష్పవేణీ నాటకము.

—:o:—

## ప్రథమాంకము—ప్రథమరంగము.

(చోళదేశపురాజు కొల్వుకూటము.)

పుష్పరథుఁడు, విశారదుఁడు, సుశీలప్రవేశము.

పుష్ప—దేవీ! ఎన్ని సంపదలున్నను సంతతి లేనియెడల వ్యర్థములని నామనంబునకుఁ బొడగట్టుచున్నది. ముద్దులొలుకు మోముతో నసియాడుచు వచ్చియురాని తనముద్దుమాటలచేతఁ దల్లిదండ్రులకుఁ బరమానందంబును జేకూర్చు సంతానభాగ్యము పూర్వజన్మకృత పుణ్యవిశేష లేశముండినఁగాని లభింపదుగదా.

సీ. ముద్దుమాటలచేత ♦ మురిపెంబుఁ జేకూర్చు
కొమరుండు లేనియా ♦ కూటమేల
పూర్ణసుధాకరుఁ ♦ బోలిమోమొప్పు కు
మారుఁడు లేని సం ♦ సారమేల
తల్లిదండ్రులయొక్క ♦ దైన్యంబుఁ బోఁగొట్టు
తనయుఁడు లేనియా ♦ ధనమదేల
కరములాడించుచుఁ ♦ గడుతోషమున్గూర్చు
బాలుఁడు లేనియా ♦ వాసమేల

ఎట్టిదుఃఖములల్లిన ♦ పట్టునైన
సుతుని కొమరారు మొగ్గమును ♦ జూచినయెడఁ
జింతలన్నియుఁ దొలఁగును ♦ చిత్తమునకు
సుతునివంటి పదార్థమీ ♦ క్షితిని లేదు.

1

మంత్రీ! నాకీజన్మంబున సంతానప్రాప్తి లేదు కాఁబోలు.

విశా—దేవా! చింతింపకుఁడు. ఈశ్వరానుగ్రహమువలన శీఘ్రకాలములోనే తమకు వాంఛితార్థసిద్ధి కలుగవచ్చును.

సుశీ—ప్రాణేశ్వరా! కొద్దినోములునోఁచి ఎక్కుడుఫలముఁ గోరిన లభించునా?

తే. గీ. తీర్థయాత్రల సెన్నేనిఁ ♦ దిరిగితిమిక
వ్రతములనొనర్చి యుంటిమి ♦ భక్తితోడ
దేవళంబులఁ గట్టించి ♦ తిమిమహీశ
అయినసంతతి లేదు భా ♦ గ్యంబదేమొ.

నాథా! ఈజన్మమున మనమెన్ని సత్కార్యము లాచరించినను బూర్వజన్మమునఁ జేసినపాతకమునకు ఫలమనుభవింపకతప్పునా?

పుష్ప—దేవీ!

తే. గీ. పూర్వకృతములౌ పాతక ♦ పుణ్యములకు
నరకముసురాలయములుండు ♦ సరసిజాక్షి
యింకమనకేటిపాపమో ♦ యింతిదైవ
మునకుదయలేదు మనమీఁద ♦ మోహనాంగి.

సుశీ—అట్లుకాదు. ఒక్కొక్క పాపమున కెన్నిజన్మాంతరములకును నివృత్తిదొరకదు. అట్టిపాపమును దేనినొనర్చియుంటిమో. సారంగధరుని చరిత్ర వినలేదా.

పుష్ప—అట్లయిన మనకీజన్మమున సంతానప్రాప్తి లేదు కాఁబోలు.

సుశీ—అట్లని నిరాశఁజెందఁగూడదు. ఏనాఁటికైన నేదేవునకైన మనపై దయరాఁగూడదా. ముందుగా మనమేల నిరాశఁ జెందవలెను.

పుష్ప—ఇంకెక్కడి యనుగ్రహము.

క. అలమృగతృష్ణలయందలి
జలములవలె వెలయునట్టి ♦ సౌఖ్యంబులనే
కలికీ కోరుదురీయిల
కలగాఁదోఁచెడిని యీాజ ♦ గంబోకాంతా.

విశా—దేవా !

తే. గీ. కష్టసుఖములు త్రాసులో ♦ ఘటములవలె
వెలయుచుండును కష్టముల్ ♦ వృద్ధిబొంద
సుఖము నశియించుచుండును ♦ సుఖమువృద్ధి
బొందకష్టము నశియించుఁ ♦ బుడమిలోన.

బుద్ధిమంతులగు దేశ్వరవారు దానినిఁ జక్కఁగాఁ దెలిసికొని సంచరింపవలయును. చీఁకటివెనుక వెన్నెల రాక మానునా !

పుష్ప—మంత్రివర్యా! ఎన్ని చీకటి రాత్రులు గతించినవి? ఎన్ని వెన్నెలరాత్రులు గతించినవి? నాకన్నియు సమముగానేయున్నవి. క్రిందటి జన్మమం దేరిని వధించితిమో.

క. ఏపాపమొనర్చితినో
ఏపిల్లల జననికిఁబిత ♦ కెడఁబాపితినో
యాపాపకర్మ ఫలములె
యీపుడమిని ననుభవించి యేగెదదివికిన్.

అంతియే కాని ఈజన్మమున నాకీవాంఛ నెఱవేఱదు.

సుశీ-విశా—అమంగళము శాంతించుఁగాక.

సుశీ-నాథా! ఏమి మునిఁగినదని యిట్లు శీలము లాడుకొనెదరు. ఇంతమాత్రమునకమంగళము నోటనుచ్చరింప వలయునా! మీకన్నముం దేగుట కీదీనురాలెదురుచూచుచున్నది.

పుష్ప—ప్రేయసీ! సుఖములేని జీవనము వ్యర్థము కదా మన యైశ్వర్యమును గాంచి సంతసించువారెవ్వరు?

సుశీ—మన ప్రజలు మనకుబిడ్డలు. వారుసంతసించినఁజాలదా.

పుష్ప—అటుకాదు. చంద్రుఁడెంత చల్లనివాఁడయినను వానిని దూషింప సాహసించువారు పెక్కుమందికలరు.

క. చల్లనివాఁడగు చంద్రుని
యుల్లంబునఁదిట్టువార ♦ లుందురటులనే
కొల్లలుగ నెంతమందియొ
యుల్లంబునఁ దిట్టుచుంద్రు ♦ యువతీనన్నున్.

గర్భవాసమునఁ బుట్టిన కుమారునివంటి వారౌదురా ?
ప్రజలు.

సుశీ—ప్రాణేశ్వరా ! ఎంతపిచ్చివారలు. సుమతీశతకములోఁ జెప్పఁబడిన "కొరగానికొడుకు "అను పద్యమును మరచితిరా యేమి?

పుష్ప—యువతీ ! చెడుకోర్కె లేలకోరవలయును ?

సుశీ—చెడుకోర్కెలేమున్నవి.

తే. గీ. ఈశుని యనుగ్రహంబుండు ♦ నెడల భువిని
లోపమేదియు రాదిఁకే ♦ లోపమయిన
దైవకృపలేనియెడఁగల్గు ♦ తథ్యమిదియ
పూర్వజన్మకృతంబిది ♦ భూతిలేశ.

పుష్ప—అమాత్యవరా ! నేనొక్కటివచించెద నాలకింపుము. చిన్నతనంబునుండియు నీవు మమ్ము సేవించుచున్నవాఁడవగుటచే నీతోఁబల్కుచుంటిని. మదీయమనోవాంఛామహీరుహంబు సమూలముగ నశించినను ఇంకొక్క యాశమాత్రము నన్నుఁబీడించుచున్నది. అదేదన,

చ. వనమున కేగి శంకరునిఁ ♦ బంకజవైరిధరున్ మహాత్మునిన్
ఘనమతినిల్పిభక్తిని న ♦ ఖండతపంబునొనర్పఁగోరి నా
మనమునవిశ్చయించితిఁగు ♦ మారునిఁగోరుచునప్పుడైననా
యినశశివహ్నిలోచనున ♦ కింకను సత్కృపరాకపోవునే.

మేమరణ్యమున కేగెదము. మదీయరాజ్యము నంత పర్యంతము నతిభద్రముగఁ జూచుచుండవలెను.

విశా—దేవా! దేవరవారిమాట కెదురాడనోపనుగాని తమ రరణ్యంబున కడగండ్లుపడుచుండ తమసేవకుఁడనగు నాకు రాజభోగములా. నేసహింపఁజాల. ఈభారంబేరి పైన నైన నుంచుఁడు.

పుష్ప—మంత్రీ! రాజ్యలక్ష్మియెప్పుడును సమర్థులైనవారినే కాని అన్యులను వరింపదు. ఈ కార్యమునకు నీవుతక్క సమర్థులు వేరొకరుగానరారు. మారుమాటాడక రాజ్య భారమును వహింపుము.

విశా—అయ్యా! తమరెన్నివిధములఁ జెప్పినను నాహృదయ మేలయో చేయివెట్టి కలఁచినట్లున్నది. మీవాక్యములు నా హృదయమున కెక్కకున్నవి.

పుష్ప—నీమనమును నేనెఱుంగనా? మదీయవియోగమే నీ కలఁతకుఁ గారణము. నావాక్యములీ పట్టున నతిక్రమింపఁ గూడదు. నీతివేత్తవగు నీకు వేరే చెప్పనవసరము లేదు. కాని నేఁజెప్పు వాక్యముల వినుము.

తే. గీ. ప్రజలఁ బిల్లలఁబోలెఁ గా ♦ పాడవలయుఁ
దప్పుఁ జేసినవారికి ♦ దండనంబు
శాస్త్రవిధిగాంచి చేయుట ♦ సమ్మతంబు
వేవిధంబులఁగాంచుట ♦ విధిపుడమిని.

విశా—తమవాక్యములను శిరసావహించితిని. నాకు సెలవొసంగుడు.

పుష్ప—మంచిది పోయిరమ్ము.

(2)

సుశీ—నాథా! ఈదీనురాలిని విడిచిపోవుటకే నిశ్చయించితిరా?

పుష్ప—కాంతా! నీవియోగ మేనుమాత్ర మెట్లు భరింపనేర్తును?

తే. గీ. ఘోరమృగములవీక్షించి ♦ కోమలాంగి
దిగులువడుదువేమోయని ♦ యిగురుబోడి
వెంటఁగొనిపోవఁదలఁపను ♦ భీకరమగు
వనముఁగాంచఁగ నేర్తువే ♦ పడతిమిన్న.

రమ్యములగు హార్మ్యాంతరములయందిరు కెలంకుల దాసీజనంబులు కైదండలిడఁగ సంచరించునీవు కంటకసమన్వితమైన యీకాఱడవుల నడువఁగలవా.

సుశీ—మనోనాయకా! మీరెచ్చటనున్న నాకవియే సౌధాంతరంబులై కన్పట్టు. మీ వెంటనున్న నాకీకడగండ్లన్నియు సుఖముగానే తోఁచును.

(3)

పుష్ప—అట్లయినఁ బయనమే నిశ్చయించితివా?

సుశీ—సందియమేమి?

పుష్ప—అట్లయిన రమ్ము పోదము. (ఇరువురు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—ఒకయూరిలో సత్రము.

(శివశర్మయను బ్రాహ్మణుఁడు ప్రవేశము.)

శివ—ఎన్ని దినంబులనుండియో మా రాజుగారికి సంతతి లేదని చింతిల్లుచున్నందుల కీశ్వరానుగ్రహమువలనఁ గన్యకారత్న ముద్భవించినది. వివాహయోగ్యవయస్కయై యొప్పుచున్న యాబాలామణి పుష్పవేణి కేవలము మహాలక్ష్మియేయగు. తగినవరునరయ పుష్పరథుఁడు నన్నంపెను. కాని యెచ్చటను దగినవాఁడు కానరాకున్న వాఁడు.

సీ. ధనముగల్గినచోటఁ ♦ దగినసద్గుణములు
గలిగియుండినవాఁడు ♦ కానరాఁడు
సద్గుణవంతుఁడై ♦ చరియించు వానికి
భూనాయకత్వంబు ♦ పూర్ణముకద
రాజ్యధనములతో ♦ రంజిల్లువానికి
రూపసంపదయన్న ♦ లోటుపడియె
దేశదేశంబులు ♦ దిరుగుచుంటినిగాని
కాంతకువరుఁడెందుఁ ♦ గానరాఁడు

తే. గీ. కన్యయాయన్నయదికన ♦ కంపుమూట
బాలయాయన్నయది సుగు ♦ ణాలవాల
యైనకాంతకుఁదగుభర్త ♦ కానరామి
వింతగాఁదోఁచెనాకిప్డు ♦ పెక్కుగతుల.

ఇఁక నొక్క మాళవదేశము పోవుట కొఱతయున్నది. ఈ పూటకీసత్రమున వసించి యపరాహ్ణసమయమున బయలు దేఱి పోయెదఁగాక. ఒక్క క్షత్రియులలోనే కాక విప్రులయందు సైతము వరుఁడు దొరకుట కడు దుర్ఘటముగా నున్నది.

(అని యొకప్రక్కఁ గూరుచుండును.)

(దేవశర్మయను మరియొక విప్రుఁడుప్రవేశము.)

దేవ—అహాహా! ఈసత్రమెంత విశాలముగా నున్నది. ఈపూటకీసత్రమున వసించెదను గాక. ఔరా! మాయునరాజు గారివంటి పట్టుదలగల మానిసి మరియొకఁడు గానరాఁడు. కడుపిన్నవాఁడైన యాతనికీబోధ లెవ్వరుగావించిరోకదా పెండ్లిమాటను దలపెట్టఁ గడువిసిగికొనును. అప్పుడాతనికిఁ గల్గు చిరాకు చెప్పఁదరముగాదు.

తే. గీ. చక్కఁదనమన్న జితపంచ ♦ శరుఁడు విద్య
లందు భారతియవతార ♦ మనఁగఁజెల్లు
నట్టిరాకొమరుండు తా ♦ నకట పెండ్లి
మాని తండ్రికి దుఃఖంబు ♦ మహినిఁ గూర్చె.

ఇంతకష్టపడి పిల్లనుఁ గుదుర్చుటయేకాని యాతఁడు వివాహముచేసికొనుననుమాటకల్ల. ఏమయిన మనకేమి. కార్యభారము పైనవేసికొన్నప్పుడు నెఱవేర్చి తీరవలయును. ఎంత తిరిగినను మాసుప్రకాశునికిఁ దగినకన్య లభింపకయున్నది. ప్రాణము విసుగుచున్నది. ఇఁక నెక్క చోళదేశమున కేగుట

తరువాయి. ఇదిగో ఈప్రక్కనెవరో బ్రాహ్మణోత్తముఁడు కూరుచుండియున్నాఁడు. సమీపించి యాతని వృత్తాంత మరసెదఁగాక. (సమీపించి) మహాద్భ్యోనమః.

శివ—(లేచి) మహాద్భ్యోనమః.

దేవ—అయ్యా! తమదేదేశము?

శివ—మాదిచోళదేశము.

దేవ—(తనలో) ఈబ్రాహ్మణుని ద్వారమున చోళదేశ ప్రభువుగారి వృత్తాంతమును దెలిసికొందునుగాక. (ప్రకాశము) తామేకార్యము నిమిత్తము వెళ్ళుచుంటిరి?

శివ—అయ్యా! వినుఁడు మాయేలికకుఁ జిరకాలము సంతతి లేక శంకరుని స్మరించి తపముఁజేయ నొకకుమారీరత్న ముద్భవించినది. ఎన్నరాని సౌందర్యమునఁ దులతూఁగు చున్న యాయమను వర్ణింపనేరితరము?

తే. గీ. కాంతగాదది మారుని ♦ కాంతగాని
నాతిగాదు కందర్పుబా ♦ ణంబుగాని
రామగాదది యింద్రుని ♦ రామగాని
కలికిగాదుమారుని శరా ♦ గ్రంబుగాని

ఆయమకుఁదగినవరుని వెదుక జనకునిచే ననుజ్ఞాతుండనై దేశదేశములు తిరుగుచు నేఁటికిక్కడకు వచ్చినాఁడ. తమదేదేశము? తమరేకార్యార్థమై పోవుచున్నారో తెలిసికొనవచ్చునా!

దేవ—(తనలో) కానఁబోయినఁదీఁగె కాలికిఁదగిలినట్లు చోళ దేశమున కేగనున్న నాకాసంగతి యంతయు నిచ్చటనే తెలియవచ్చినది. (ప్రకాశము) మాదిమాళవదేశము.

శివ—(తనలో) మాళవేశ్వరకుమారుని వృత్తాంతమీ మహీసురునివలనఁ గనుఁగొందునుగాక. (ప్రకాశము) తమ నామధేయము ?

దేవ—దేవశర్మయనిపిలుతురు. మారాజుగారికి సంతతిలేక హరిని గురించి తపముఁజేయ నొక కుమారుఁడు గల్గె. అతనికి కాలక్రమమునఁ జౌలోపనయనాది కార్యంబులయినపిమ్మండు వివాహముఁజేయ నిశ్చయించి తగిన రాకొమరితను దెలిసికొని రమ్మనినన్నంపఁగా వచ్చినవాఁడను. ఆరాకొమరుండును దన నెచ్చెలియు సహాధ్యాయుఁడునగు సుమతి యను మంత్రికుమారుంగూడి యాదర్శమువలె సకలవిద్యలను గ్రహించుచుండెఁగాని యాతనికొక్క సంగతిఁజెప్పిన ననిష్టము.

తే. గీ. ఇంతియన్నను నతఁడెంతొ ♦ యేవగించుఁ
బెండ్లిమాటను దలఁపెట్ట ♦ విముఖుఁడగును
బ్రహ్మచర్యంబె నరునకుఁ ♦ బరమసుఖము
బ్రహ్మవిద్యయె నరునకుఁ ♦ బరమపదము.

అనుచు నతఁడెంతయు స్త్రీలయెడఁ బరాఙ్ముఖత్వమును గలిగియుండును. తండ్రిమొదలగు వారెంత చెప్పినను వినఁడయ్యె-

లోకోత్తరసౌందర్య విరాజితయగు కన్యకామణిం జూపినప్పు డైన నొప్పుకొనునేమో యని వారియభిప్రాయము.

శివ___ప్రతిబింబము నొకపరి చూపించెదరా?

దేవ___ఇదిగో చూడుఁడు (ఇచ్చును)

శివ___(రెండుపటములను సమముగఁజేర్చి) అయ్యా! చూచితి రా యీమిథునమును.

దేవ___(చూచియానందముతో) అయ్యా! పితామహుండు వీరలనిరువురనుగోరి సృష్టించినాఁడని తలఁచెదను. ఇట్టి దాంపత్యమును జూడఁబోము.

శివ___అట్లయినఁ బటములు మార్చుకొందమా?

దేవ___అట్లనే. (పటములను మార్చుకొని నిష్క్రమింతురు.)





# సంగీత పుష్పవేణీ నాటకము.

## ద్వితీయాంకము.

### పుష్పరథుని కొల్వుకూటము.

(పుష్పరథుఁడు, విశారదుఁడు, సుశీల ప్రవేశము.)

పుష్ప—మంత్రీ! యిప్పుడుకదా సఫలమనోరథుండనైతిని.

ఉ. నాదగునోముపంట సుగు ♦ ణంబులకున్నిధి నాదుకూతురీ
మేదిని బెండ్లికూతురగు ♦ మించిన భాగ్యము గల్గెనంచు నే
మోదమునందుచుంటిఁగద ♦ పుష్పశరారి కృపాకటాక్ష మే
శ్రీదమునై చెలంగె మన ♦ చిత్తమునంతసమందెఁ జూడఁగా.

కన్నఁగన్నదైవములకు మ్రొక్కి చూచినతీర్థంబులఁ గ్రుంకి విన్న పుణ్యవ్రతంబుల నెల్ల నాచరింపఁ దుదకు మహేశ్వరానుగ్రహము వలనఁ గలిగిన నాముద్దులపట్టికిఁ బెండ్లిజేయు తరుణము వచ్చుచున్నదిగదాయని నామనంబు మిగుల సంతోషసాగరమున నోలలాడుచున్నది.

విశా—దేవా! తమసేవకులమగు మాకును, దమకన్న వేయిరెట్లధికానందము గల్గుచున్నది.

క. తమప్రభువుల సంతోషమె
తమప్రభువుల గృహములందుఁ ♦ దనరుశుభములన్

తమవిగ నెంతురు సేవకు

లు మహీశ నరాధినాథ ♦ లోకంబందున్.

పుష్ప—మంత్రీ ! నిజమును పల్కితివి సుమా ! నమ్మకమైన సేవకులు యజమానులన్నఁ బ్రాణమప్పగింతురు.

సుశీ—అట్టివారలలో నీవగ్రేసరుఁడవుగదా.

విశా—తల్లీ ! అనుగ్రహింపఁబడితిని. అంతయుఁ దమకరుణా విశేషము.

పుష్ప—మంత్రివరా ! దానికేమికాని అలనాఁడు,

క. మనుజేశసుతుల పటములఁ

గొనిరమ్మని పంపినట్టి ♦ కువలయసురుఁ డిం

కను రాకపోయెనేమో

కనుగొనుమా మంత్రివర్య ♦ క్రమ్మరనిపుడే.

విశా—దేవా! ఆ మహీసురుఁడు జాలము సేయువాఁడు గాఁడు ఈపాటికి వచ్చుచునేయుండును. బోయిన కార్యము నెఱవే అవలెనుగదా. అదిగో ప్రతీహారి వచ్చుచున్నాఁడు.

ప్రతీ—(ప్రవేశించి) దేవాజయము.

విశా—ఏమిరా ! విశేషములు?

ప్రతీ—బ్రాహ్మణుఁడొకఁడు తమదర్శనార్థమై ద్వారమునొద్ద వేచియున్నాఁడు.

విశా—శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

(ప్రవేశము శివశర్మ.)

పుష్ప—విప్రవర్యా! నమస్కార మా పీఠము నలంకరింపుఁడు.

శివ—ఈప్సితార్థసిద్ధిరస్తు.

పుష్ప—మీ రేగిన కార్యమేమయ్యెను ?

శివ—సాధ్యమగునంతవఱకు నెఱవేర్చుకొనియే వచ్చితిని. సెల
వయ్యెనేని ప్రతిబింబములఁ జూపించెద.

పుష్ప—అంతకన్న కావలయునదేమున్నది. దేవీ ! నీవేగి
మనయమ్మాయినిఁ గొనిరమ్ము. ఆమెసంతసించిన పిమ్మటఁ
గదా మనము.

సుశీ—చిత్తము (వెళ్ళును.)

శివ—మనుజేశ్వరా !

క. తిరిగితిని పెక్కుచోటులఁ
బురపాలకసుతులయొక్క ♦ మూర్తులనెల్లన్
నరనాయక కొని తెచ్చితి
త్వరితంబుగఁ గాంచుమిపుడె ♦ ప్రతిబింబములన్.

ఎంతమందిని గాంచినను తగినవాఁడెవ్వఁడును గానరా
కున్నవాఁడు. ఉన్నవారిలో నొక్కఁడు మాత్రము నామదికి
నచ్చియున్నవాఁడు.

పుష్ప—అతఁడెవ్వరు ?

శివ—వీక్షింతురుగాక.

(సుశీల, పుష్పవేణి ప్రవేశము)

పుష్ప—(కూతుం దగ్గఱకుఁదీసికొని) అమ్మా!

ఆ. వె. నాదుముద్దుకూన ♦ నాపాలిభాగ్యంబ
నామనోధనంబ ♦ నాదుపట్టి
అమ్మ నీకుఁదగిన ♦ యట్టి రాపట్టినిఁ
జూచి చెప్పు మమ్మ ♦ సుమశరీర.

పుష్పవే—(తలవంచుకొని కూర్చుండును.)

పుష్ప—విప్రవర్యా! చూపింపుఁడు.

శివ—అయ్యా! ఆపటములయందు వారివారి దేశనామము-
లు లిఖింపఁబడియేయున్నవి. కనుకఁ జెలికత్తెను జూపింపు
మనిన యుక్తముగా నుండును.

పుష్ప—అవును. ఎవరక్కడ?

ప్రియంవద—(ప్రవేశించి) దేవా! ఏమిసెలవు?

పుష్ప—ప్రియంవదా! ఈపటముల నీచెలికిఁ జూపింపుము.

ప్రియం—చిత్తమట్లనే. (పటమును జూపించుచు) చెలీ! ఈతఁడు

1

పాండ్యదేశపు రాజకుమారుఁడు. చక్కఁగాఁ దిలకింపుము.

పుష్పవే—(చూచి పటము నావలఁబెట్టును)

ప్రియం—సఖీ! ఇతఁడు కన్నడదేశపు రాజకుమారుఁడు చక్కఁ-
గాఁ దిలకింపుము. (2)

పుష్పవే—(తనలో) ఈతనికి వేషగాంభీర్యమే కాని వేఱులేన ట్లున్నది. చూడనక్కఱలేదు. (పటమునావలఁబెట్టును.)

ప్రియం—దీనినిఁజూడుము. (3)

పుష్పవే—(తనలో)

తే. గీ. పైవిలాసపు వేసంపు ♦ వరుసఁజూడ
గరువమొప్పుచు నున్నట్టి ♦ నరునిమాడ్కిఁ
గానవచ్చెను జూడ న ♦ క్కఱయెలేదు
(ప్రకాశముగా)
వేఱొక పటంబునుంజూప ♦ వే మృగాక్షి.

ప్రియం—మానిని ! ఇతఁడు కోసలేశ్వరసుతుఁడు. మహాసి యుండగు నీతని వరింతువా ? (4)

పుష్పవే—(తనలో) ఈతని ముఖమును గాంచిన క్రోధరసంబు దాండవం బాడుచున్నట్లున్నది.

తే. గీ. శాంతరసమించుకేనియు ♦ స్వాంతమందు
లేనికోపిగఁదోఁ చెను ♦ మానసమున
కితనివరియింపనాచిత్త ♦ మియ్యకొనదు
కాన దీనినిఁజూడ న ♦ క్కఱయెలేదు.

సుశీ—భూసురోత్తమా ! ఇవియేనా పటములింకను గలవా?

శివ—అమ్మా ! ఎన్నిచిత్తరువులఁ జూపించినను వంకలన్నిటికిని వెదకి దూరముగాఁద్రోసివేయ నేనెచ్చటనుండి తేఁగలను

భూమియంతయుఁదిరిగి నామదికిమెచ్చుఁదగ్గవారిలో నవమ న్మథాకారుల నేరితెచ్చితిని మఱియొక్కటి నాయొద్దఁగలదు. అంతకన్న నాయొద్ద లేదు. (సుప్రకాశుని పటమును ప్రియం వద కందిచ్చును.)

ప్రియం.—చెలీ! ఈయందగానిం జూడుము. (5.)

తే. గీ. చేరలకు మించుఁగన్నులు ♦ చిత్రముగను
మేల్మిబంగరుఁబోలిన ♦ మేనిచాయ
పూర్ణిమాశశాంకునిఁబోలు ♦ మొగముగల్గు
మాళవాధీశపుత్త్రుని ♦ మంగళాంగు.

పుష్పవే.—(చూచియానందముతో) ఆహా! ఏమి యీసౌంద ర్యంబు. ఈసుందరాంగుని యందంబునకుఁ దగినవిద్య యు న్నదో లేదో కాని మొగమెంతచూచినను సత్త్వగుణప్ర ధానమై యొప్పుచున్నది. "యత్రాకృతి స్తత్రగుణాభవంతి". యన్నట్లు సర్వము సిద్ధముగానే యుండును. (పటము తల్లి కందిచ్చును.)

పుష్ప.—మహీసురోత్తమా! ఈసంబంధ మన్నివిధములఁ దగినట్లు తోఁచుచున్నది. విద్యలయం దీతఁడెంతవాఁడో!

శివ.—అయ్యా! విద్యలయందాతని భారత్యవతారమని చెప్పి కొందురు.

పుష్పవే— (తనలో) నాయనగారు నాహృదయశల్యమును సమూలముగాఁ బెల్లగించినారు. ఇట్టివానినిఁ జేపట్టుటఁ గదా జన్మధన్యము.

పుష్ప—సరే. అన్నివిధముల యుక్తముగనేయున్నది. దేవి! నీయభిప్రాయమేమో తెల్పవైతివి.

సుశీ—నాథా! తమయానతికి వేరుగా వర్తించుదానను గాను తామెఱుంగరా?

శివ—దేవా! తాముపల్కినది నిజమేకాని ఇప్పట్టునఁ దాము వేఱొకనినిఁగూర్చి యోచించినచో యుక్తమని తోఁచుచున్నది.

పుష్పవే (తనలో) ఇదియేమి ఈబ్రాహ్మణుఁ డిట్లుపల్కినాఁడు.

పుష్ప—అయ్యా! ఏమట్లుపల్కితిరి?

శివ—అందుకొక కారణముగలదు. ఏమంటిరేని ఆతనిపేరు సుప్రకాశుఁడు. అతనిస్వభావమెట్టిదనిన,

తే. గీ. సతులటన్నను మదిలోన ♦ సహ్యపడును
పెండ్లియన్నమాటయె తల ♦ పెట్టనీఁడు
దనుజహారకీర్తనము ముక్తి ♦ దాయకమని
చదువుచుండును గ్రంథము ♦ ల్సంతతంబు.

వివాహమన్న నాతనికిఁగల యనిష్టము సెప్పఁదరముగాదు. స్త్రీజనంబును గన్న వ్యాఘ్రంబునుగాంచిన మృగంబుభాతి బెదరిపోవును. ఈవిషయమునఁ దండ్రికిని నాయనకును బట్టు

దలగా నున్నదని పల్కుచున్నారు. కొమరుడు పెండ్లిచేసి కొననియెడల కారాగారంబున బంధించి బలిమిని బెండ్లిచేయ యత్నించుచున్నారు. మనమెన్ని ప్రయత్నంబులను జేసి నను సాగదుగావున వేఱొక యత్నమును జేయుటమంచిది.

(రాజు రాణి మొగంబులను జూచుకొందురు)

పుష్ప—కుమారీ ! వింటివికదా మనవిప్రుని వాక్యములను వారియుపదేశము ననుసరించి వేఱొకపురుషునిఁ గోరి కొనుట యుక్తముగాదె.

పుష్ప—నాయనగారూ ! ఎట్టియుపదేశమును గావించితిరి.

చ. మనమున నెంచు నాథుఁగన ♦ మాని పరున్
మదిలోన మెచ్చుటల్
ఘనకులమందుఁగాంచితివె ♦ మానవనాయిక
చిత్తమందు నె
వ్వనిఁగని మెచ్చునో యతఁడె ♦ భర్తగఁ దాఁ
దలపోసివానినే
తనువరియించియుండుటయె ♦ తన్వికిధర్మము
ధాత్రిలోపలన్.

పాలసముద్రమునంటి మనకులంబున కీనాఁటి కపకీర్తి కల్గునని యెనఁదలఁపవైతివి.

సుశీ—పుత్త్రి ! మీనాయనగారిమాటకెదురాడకుము.

పుష్పవే—జననీ !

తే. గీ. ఇత్తరినినీవు తెల్పిన ♦ క్రొత్తధర్మ
మేననుసరింపనాదగు ♦ హృదయమునకుఁ
బాతకమనుచుఁదెలియఁగ ♦ వచ్చెఁగానఁ
దల్లినేఁజేయఁజాల నీ ♦ ధర్మమిపుడు.

ముందొక పురుషునిఁగాంచి యితఁడు నాథుఁడయిన బాగుండునని యెంచి మరల మఱియొక పురుషునిపై మనమును మరల్చుట సత్కన్యాలక్షణముకాదు కావున నట్టిపనినిఁ జేయఁ జాలను.

శివ—అమ్మా ! పుష్పవేణీ ! ఇప్పట్టునఁ బెద్దలమాట నిరాకరింపఁజనదు. ఆపనినిఁ జేసిన దోసములేదని శాస్త్రమును జూపించెద. కులమునకును వంశ్యులకును బెద్దవాఁడనగు నా మాటనయినఁ బాటింపుము.

పుష్పవే—స్వామీ !

కం. ఒప్పులనుచెన్ని చెప్పిన
నిప్పట్టుననామనమున ♦ కిచ్చకలుగదో
యప్పానను(గరుణింపుము
చెప్పఁగలనెమీయెదుటను ♦ క్షితిసురవర్యా. 6

స్వామీ ! యెదురాడినందులకు మన్నింతురు గాక.

శివ—నిన్నాతఁడు చేపట్టనని వార్తనంపిన నేమిచేయుదువు ?

పుష్పవే—ఆర్యా ! అయిన నానిశ్చయమును వినుఁడు.

ఉ. సన్నిధి కేగిచూచెదను ♦

శివ___స్వాంతమ్మునన్నినుమెచ్చెఁడింకనో యన్నులమిన్న
పుష్పవే___నేనతని ♦ యంఘ్రులఁబట్టుచు వేడుకొందు నీ
శివ___వెన్నివిధంబులట్లునుతి ♦ యించిననాతనిచిత్తమొప్పదో
క్రొన్ననబోఁడి
పుష్పవే___చావున కు ♦ కొందలమందనుధాత్రిలోపలన్. 7
శివ___(తనలో) ఏమి ! యీసాధ్వీరత్నము యొక్కనిశ్చల చిత్తము.
పుష్ప___అమ్మా ! నాకువిచారమును గూర్చుచుంటివిగదా
పుష్పవే___నిజముజనకా ! నిజము. నేను జన్మించినందువలన మీకుదుఃఖమేకాని సౌఖ్యమెంతమాత్రమును లేదు. నేనేమి చేయఁగలను.
శివ___రాజాగ్రణీ ! నీసుతఁజూడఁగా పసితామతల్లియని తోఁచుచున్నది. ఒకవేళ నీమెమాహాత్మ్యము వలన నా రాజకుమారుని కాపిచ్చి తగ్గనేమో. ఎవ్వరెఱుంగుదురు. ఈయమ పతివ్రతయని పొగడ్తనందనున్నది.
పుష్ప___అయ్యా ! మీయాశీర్వచన మమోఘముకదా ! అమ్మా ! పుష్పవేణీ ! నీయిచ్ఛవచ్చినట్లు చేయుము. ఇఁక మేము పోయెదము.

(పుష్పవేణితప్ప తక్కినవారు వెళ్లుదురు)

పుష్పవే___ మహానంద సాగరమునఁ దేలలాడుచుండ సంతోషప్రవాహమునకడ్డు కట్టవైచినారు. ఈ బ్రాహ్మణుఁడు

పల్కినవాక్యములయం దసత్యమేమియు నుండియుండదు (సుప్రకాశునిపటముఁజూచి) ఆహా! ఏమియీపురుష సింహుని యాకారవైభవము (ఆ)

తే. గీ. నిండుచందురుఁ బోలెడి ♦ నెమ్మొగమున
క్షాత్త్రతేజము వెలయఁగ ♦ సత్త్వగుణమె
యొప్పుచుండు మొగంబుతో ♦ నిప్పుడిమిని
రాచకులమున కీతఁడు ♦ రత్నమయ్యె.

క్షత్త్రియవంశహారమునకు మణిప్రాయమవలెనే విరాజిల్లుచున్నవాఁడు. చేపట్టిన నట్టివానిం జేపట్టవలెను. లేకున్నఁ గన్యాత్వంబునఁ గాలంబు వెళ్లించుటమేలు. పెద్దవారిమాటలు వినకున్న గురుతిరస్కారదోషము సంభవించునేమో? (తలపోసించుచు) అట్లుకానేరదు పెడత్రోవలఁ బెట్టి దుర్బుద్ధులగువారు గురువులైననువారి వాక్యము లాదరణీయములుగావు. ఏరీతిగ నేర్పినఁ దనుబాలికలు కీర్తినార్జించెదరో యామార్గములమాని దుర్బుద్ధులుగలగురువులు గౌరవనీయులు కారు. నాయాశయే కాని యాతఁడు నన్నువరించునా ఏమో? అన్నిటికిని ఆర్తత్రాణ పరాయణుండగు నారాయణుఁడే కలఁడు. సృష్టిస్థితిలయకారణ భూతుఁడగు నామహాత్ముఁడేదియో పన్నుచు నేయుండును. నాకేలయీవిచారణ? నాచెలికత్తెలను గలియఁబోయెదఁగాక.

(నిష్క్రమించును.)



# సంగీత పుష్పవేణీ నాటకము.

—:o:—

## తృతీయాంకము.

### మాళవరాజు కొలువుకూటము.

(కీర్తివర్మ, నీతిజ్ఞుఁడు ప్రవేశము.)

కీర్తి—మంత్రీ! చిరంజీవి యెట్లున్నవాఁడు ?

నీతి—దేవా ! నేనేమని విన్నవింతును. ఎంతమాత్రము నతని చిత్తము స్త్రీవాంఛిక సంబంధమైన హాసభావవిలాసాదుల యందుం బోవకున్నయది. ఎల్లప్పుడు సహాధ్యాయులం గూడి యో లేక దేవరయాస్థానవిద్వాంసులం గూడియో విద్యా వ్యాసంగమును జేయుచుండును.

కీర్తి—అక్కటా యిట్టి చిన్నతనము దీతనికి బోధ లెవ్వరు గావించిరోకదా ?

నీతి—విద్యలందాసక్తియుండుట కడుగౌరవనీయమేకాని క్రమముగా నయ్యది విరాగినిం జేయునేమోయని భయంపడుచున్నాను.

కీర్తి—అమాత్యా ! కడకాతని మనమందలి వాంఛయేమో గ్రహించితివా ?

సతి—అతఁడు యోగవిద్యా ప్రభావసమన్వితుఁడై వేదాంత శాస్త్రపారంగతుఁడై తపోవృత్తి నవలంబింపఁ దలఁచినాఁ డని తలఁచుచుంటిని.

కీర్తి—ఒక్కమారాతని నాకిడకుఁ గొనిరమ్ము.

సతి—చిత్తము (నిష్క్రమించిసుప్రకాశునితోఁ బ్రవేశము)

(దూరమున సుప్రకాశుఁడు)

(1)

సుప్ర—ఆహా! మోక్షమార్గవిధ్వంసకులగు కాంతలఁ జేపట్ట నేల, నరకకూపంబునఁ బడనేల?

తే. గీ. అబ్ధిబడినట్టి మనుజున • కైనఁ దిక్కు
దొరకవచ్చునుగాని యీ • స్త్రీ విలోక
నాఖ్యసముద్రమునఁ బడఁ • బడినయట్టి
మనుజునకు దరిదొరకుటఁ • గనము జగతి.

ఆహాహా! లోకమెంత యజ్ఞానసంయుక్తమైయున్నది. హా హా ఎట్టి భ్రాంతిలోఁబడితమ్ముఁ దామునుఱచుచున్నారు. ఇ[illegible]నమో? మాయావికారమో? చిత్తవిభ్రమమో? తెలియకున్నది. ఈ యజ్ఞాన మహావనంబునుగాల్ప సుజ్ఞానబోధయను ప్రజ్వల దావాగ్నియే సమర్థమైనది. ఎంతచదివినను ఎంతవిన్నను ఈ విద్యయొక్క ప్రభావము వాగతీతముకదా! ఎంతవ్యయపఱచిన నంత వృద్ధిపొందునదియు ఎంత నెచ్చించినను దఱుగనిదియు నగు నీ విద్యానందప్రభావమును వర్ణింపనావశముగాకున్నది. విద్యయనఁగానేమియో దాని స్వరూపస్వభావములను జక్కఁ

గాఁ దెలిసికొని సంచరించువానికిఁ బ్రపంచకమే కాక సమస్తదేవతలు వశంవదులై యుందురనుటకు సందియము లేదు. అట్లు కాక సమస్తగ్రంథములను జదివి విద్యలనెల్ల గ్రహించియుఁ దత్సారాంశమును గ్రహింపలేక దుర్మార్గమునఁ బడి చరించువారు పండితభ్రువులనిపించుకొందురు. మోహాంధులై సంసారమహార్ణవమునఁ బడి మునింగి తాపత్రయపీడితులై బద్ధులైయుండు మానవునకు జ్ఞానవిదితమైన మోక్షమునకు స్వర్గమర్త్యలోకముల కున్నంతదూరమున్నది. ఎవ్వఁడు తన జ్ఞాననేత్రముచేత నీశ్వరుండను పదార్థమును తెలిసికొనుచున్నాఁడో, యెవ్వఁడు తన పంచవాయు, పంచకోశ, పంచతన్మాత్రయుక్తమైన దేహమందాస విడిచి సహస్రారకమలాంతర్వ్యాపియైన సచ్చిదానందపరబ్రహ్మతేజోవిలాసంబును గాంచుచున్నాఁడో అట్టివాని దేకదా జన్మము. ఇప్పుడు పూజ్యులైన తండ్రిగారు నన్నుం దలఁచుకొని పిలిపించియుందురు. (యోచించి) ఎందులకోయననేల ! ఎప్పటిమాటలే విని ఎవి చెప్పుటకు చెవులు వడఁచున్నవి. ఏమైనను పెద్దలవాక్యములను దూషింపరాదు. (సమీపించి) జనకా ! సమస్కారము.

కీర్తి—(చేరఁదీసి) నాయనా చిరంజీవ !

సుప్ర—దేవా ! నన్నుఁ బిలిపించిన కారణమేదియో తెలుపఁ వేఁడుచుంటి.

కీర్తి—నాయనా ! ఏమి చేయుచుంటివి ?

సుప్ర—జనకా ! పంచదశియను గ్రంథములో నానందప్రకరణములోని విద్యానందంబను ప్రకరణమును జదువుచుంటిని.

కీర్తి—నాయనా! నేనొక్క సంగతిని నీకుఁ దెలుపనెంచి పిలిపించితిని. తొందరపడక నా వాక్యమును శ్రద్ధతో నాలింతువా?

సుప్ర—తండ్రీ! తమ దాసుఁడు తమ వాక్యముల కెన్నఁడైన నెదురు పల్కునా?

కీర్తి—కుమారా! సంతతికొఱకై పెక్కుచిక్కులఁ బడి అరణ్యములపాలై యెట్లో విష్ణుదేవుని వరమువలన నిన్ను సంపాదించుకొంటిని. అట్లు నాగర్భమున నీవు జనించుటఁ జేసి నీపితామహులకెట్లు గతులుగల్గెనో అట్లే నాకును పుత్త్రుఁడు గల్గకున్నఁ బరమందు గతులు గల్గనేరవు గాన మాకీయహితార్థమై వివాహముఁ జేసికొనవలయునని నాకోరిక.

సుప్ర—తండ్రీ! మీరెంత చెప్పినను వివాహమన్న నామన మేవగించుచున్నది. నారీరత్నముల చంచలకటాక్షవీక్షణముల బాఱికిగుఱియై మోసపోవని పురుషుఁడెవ్వఁడుఁ గలఁడు. నీటిబుగ్గవంటి యీదేహమును తుచ్ఛసౌఖ్యముల పాలుచేసి దుర్గతుల పాలగుటకంటె సత్సాంగత్యమును సంపాదించి భగవత్సేవయందే కాలమునుబుచ్చి శాశ్వతానంద పదవిఁ బొందుట యుక్తముకదా?

కీర్తి—జనకాదులంతవారిచేత నంగీకరింపఁబడినయీద్వితీయాశ్రమమునందలి మహిమను నీవెఱుంగమి నట్లు దూషించుచున్నావు.

సుప్ర—గృహస్థాశ్రమము నందలి మహిమ నే నెఱుంగ
పోలేను.

తే. గీ. బ్రహ్మచారులఁ బోషింపఁ ♦ బట్టుగాను
జీవకోట్ల కాధారమై ♦ చెలఁగుచుండు
యతులఁ బోషింప ననువగు ♦ వితము దీనిఁ
బోలు నాశ్రమ మెయ్యది ♦ పోల్చిచూడ.

ఈసంగతి నేనెఱుంగక పోలేను. దానిని దూషించ [illegible]యుఁ గాను. ననుఁ బోలు నసమర్థున కందుఁగల కష్టములన [illegible] చేసికొనుచున్నాను. ఇఁక జనకాదు లందు రేమో.

క. జనకాదులు మాహాత్మ్య [illegible]
బును ఘనశక్తియుఁ గలారు ♦ పోల్పఁగ దండ్రీ
[illegible]కును వారికి భేదము
మనుకేశా ! చాలఁగలదు ♦ మదిలోఁ దలఁపన్.

మహామునులతోఁ దులదూగు శక్తికలవారు గనుకనే [illegible] రాజ్యాభిషిక్తులయ్యును దామరాకులోని [illegible] దును నంటక మోక్షమునుఁ జూరగొనిరి. నేనంత శక్తికలవాఁడను గాను. కనుకనే ముందుగ జాగ్రత్తపడవలెను.

[illegible]—విద్యాలయమందుఁ బరిపూర్ణుఁడవగు నీకు నేఁ జెప్పనక్కఱ లేదు. కాని నాయొక్క మాటమాత్రము వినుము. బ్రహ్మచర్యమవలంబించి ఋషిఋణంబును గృహస్థధర్మ మవలంబించి దేవపితౄణంబులను దీర్పవలెనని కదా పెద్దలు

పల్కుదురు. ధర్మముచేయవలెనన్నను బుణ్యవ్రతముల
నాచరింపవలెనన్నను గృహస్థాశ్రమమేకదా యాధారము
అనేకజీవకోటులు కుటుంబీకునిఁ జేరి జీవయాత్రఁ గడపు
చున్నవి. గాననట్టియాపదవి కష్టదముకాదు. కావునఁ దగిన
కన్యను బెండ్లాడి రాజ్యరమను జేఁబూని సుఖంబుండుము.

సుప్ర—తండ్రీ! యోచించఁగా నాకిట్లుతోఁచుచున్నది. త్రి
మూర్తులంతవారు తమకాంతలను స్వేచ్ఛగ వదలిన నేమి
యపకీర్తిఁ బెత్తురోయను భయంబున ముఖమున నొకరు
నురంబున నొకరు శరీరమున సగమిచ్చి యొకరును భార్య
లను గూడఁ ద్రిప్పుకొనుచున్నారు. అబలల నెవ్వరు
నమ్మెదరు?

కీర్తి—ప్రపంచకములో గుణవతులగు కాంతలే లేరందువా
యేమి?

సుప్ర—లేరనికాదు. నావిధిలిఖితము బాగుండనియెడల దుష్ట
సతియే లభించునేమో! నాగ్రహచార మెవ్వరెఱుంగుదురు?

కీర్తి—పెద్దవాఁడనగు నామాటనువినుము. చోళదేశాధీశ్వ
రుని పుత్రికయగు పుష్పవేణి సుగుణంబుల కాటపట్టనియు
విద్యావతియనియు వింటిముగాన నాకన్యను బెండ్లాడి
నాకుల్లాసమును గల్గింపుము.

సుప్ర—అయ్యా! నన్నెంత దండించినను బడఁగలను గాని
మీమాటలకు నాచిత్తమొప్పకున్నది. "విసముపెట్టిన కుఁ

డుచునే ప్రియసుతుండు" అనురీతినిం జూచుచు మహాం బుధిలోఁ ద్రోయఁదలంచిన నెవ్వరొప్పుకుందురు? (2)

తే. గీ. వనమునకుఁబోయి సన్మునీ ♦ శ్వరులసేవఁ
జేసితపమును జేయుచు ♦ శ్రీశుమదిని
నిల్పి నిరతము ధ్యానించి ♦ నిష్ఠతోడ
ముక్తినిం జూరఁగొనెదను ♦ మోదమలర

శ్రీ—(విచారముతో) నాయనా! నిన్నుఁగన్నందులకు నాకు నరకమే గతియని విచారించుచుంటిని కన్నతండ్రిని పుర్గ తులపాలుసేసి నీవెంతతపంబొనర్చినను ఫలించునే?

సుప్ర—(తనలో) ఇప్పుడు వీరికి నేనెంతచెప్పఁజెప్పినను మది కెక్కుటలేదు. తండ్రిగారి మనము ఖేదపడుచున్నది. పెద్దలమనసును దుఃఖపెట్టుట సత్పురుషలక్షణము కాదు. ఇట్లుసమాధానపఱచెదఁ గాక (ప్రకాశము) నాన్నగారూ! నిజమట్లుండుటచేఁ దమతో నట్లుపల్కితినిగాని దీనికై తామింత విచారింపనేల నాతుదివాక్యంబులవినుఁడు. ఇటుమీఁద నేనుదేశములఁ దిరిగి నామదికి నచ్చిన కన్యను బెండ్లాడెదను. నాకనుజ్ఞయిండు.

సతి—(తనలో) ఇదియొకవంక గాని మనస్ఫూర్తిగాఁ బల్కిన మాటగాదు.

శ్రీ—(ఆనందముతో) కుమారా! అట్లేకానిమ్ము ఎట్లైనను నీవువివాహితుండ వగుటయే నాకోరిక. నీవెంటవలసిన పరివారమును ధనమును గొనిపొమ్ము.

సుప్ర—అయ్యా! నాకేమియును వలదు. నాప్రియమిత్త్రుఁడగు సునీతినిమాత్రము కొనిపోయెద.

కీర్తి—అట్లేకానిమ్ము (మంత్రింజూచి) మంత్రీ ! యీవృత్తాంతమును వ్రాసి చోళదేశాధీశ్వరునకుం బంపుము.

నీతి—చిత్తము.

(ఇరువురునిష్క్రమింతురు.)

సుప్ర—ఇక్కడికి గృహసంబంధమైన చిక్కుకొంత వదలినది. పెద్దలను సమాధానపఱచిన పిదప మనమునకుం గొంత నెమ్మది కలుగవచ్చును. ఈరీతిగ నొకయరణ్యమునకుం బోయి ఋషీశ్వరులసేవఁజేసి తత్త్వవిచారణచేఁ గాలమును వెళ్లించెదఁగాక. (3)

(నిష్క్రమించును)







# సంగీత పుష్పవేణీ నాటకము.

:o:

## చతుర్థాంకము-ప్రథమరంగము-అరణ్యము.

(ప్రవేశము-పుష్పవేణి)

పుష్ప— (1)

తే. గీ. వనములన్నియు వెదకితిఁ ♦ బ్రాణకాంతుఁ
డక్కటా కానరాఁడయ్యె ♦ దిక్కెఁ కెవ్వ
రే మొగంబున నేనింక ♦ నేగుదాన
మరల నాదగు జనకుని ♦ పురముఁజేర.

సపరివారనై భర్తను వెదక బయలువెడలి పరివారము నకా దూరమైతిని జననీజనకులకా దూరమైతిని. మనఃకాంతుఁ డేడనుండెనో కానరాకున్నవాఁడు. అర్ధరాత్రంబున యామా యదారి సింగంపు టార్భాటంబుల విని దిగులువడి ప్రాణంబులపై నాశచేతఁ దలకొక దిక్కునకుఁ జెదరిపోయిన నాపరివార మెచ్చటనుండి రాఁగలదు. అప్పుడే మార్తాండుండు నభోమండల మధ్యవర్తియయ్యె. పాదంబులా కడునొచ్చుచున్నవి. అక్కటా! ఎట్టిఘోరదురవస్థల పాలైతిని. (2)

ఇప్పుడెక్కడికి కేగుటకును త్రోవ తెలియకున్నది. పెద్దలువలదని యెంతబ్రతిమాలినను వినక నాధుఁడెక్కడనున్నను

వెదకికొని వత్తునని ప్రతిజ్ఞఁజేసి బయలుదేఱివచ్చి యిప్పటికెంట
రిగ గృహంబునకేగిన నలుగురునన్నుఁ జూచినవ్వరే ?

ఉ. ఎంతటి పాట్లనైనను స ♦ హించి మనోవిభు గాంతుఁగాక నా
వంతలఁ దీర్చునే నను వి ♦ వాహముఁ జేసికొనంగ నేర్చునే
పంతమువీడునే యతఁడు ♦ పద్మభవుండు మదీయ ఫాలమం
దెంతటి వ్రాఁత వ్రాసెనొ య ♦ హీనసుఖంబుల నంద నేర్తునే!

విధి యేరీతిగ నున్నదో యెవరికిఁ దెలియదుగదా? అక్క-
టా! విచారపరివర్ధితమైన మదీయహృదయమునవలెనే యున్న
దీకాననము. శాఖోపశాఖలై వర్ధిల్లు మదీయ వాంఛానమూ
హములో యన్నట్లున్న వీవృక్షములు. యోచించఁగా,

చ. నరుఁడుభవాబ్ధిఁదాటఁగ మ ♦ నంబున నెంచిమురారినామసం
స్మరణనుగాలముక్తి గడప ♦ స్వాంతమునందుదలంపకేవనా
తరమునకంటెగొప్పదగు ♦ తావికెఁదోఁపదుచూడగాభయం
కరమగు కాననంబె సుఖ ♦ కారణమౌ నివసింప నెంచినన్.

ఈయరణ్యము దాఁటుటకు వెరపుతోఁచకున్నది. తోఁ
చకేమి ? మనోనాయక సందర్శనమే యీవనముదాటు సాధ
నము అది లభింపకున్నఁ గర్తవ్యమేమి ! మఱియొకరిని వరించి
పతివ్రతల కాలయంబని ప్రఖ్యాతికెక్కిన యార్యావర్తమున
కపఖ్యాతిఁ దెచ్చి వంశమున కపకీర్తిఁ దెచ్చుటకంటె మరణ
ము మేలుకదా. పూర్వకాలమందలి సతీమణుల చారిత్రములను
దలఁచుకొనిన నొడలు పులకించుచున్నది.

సీ. యమునితోఁ బోరాడి ♦ రమణులందఱు మెచ్చ
నాథుని బ్రతికించు ♦ నాతి యొకతె
మగని ప్రాణంబుకై ♦ మార్తాండ జననంబు
గాకుండ శపియించు ♦ కాంత యొకతె
బ్రహ్మవిష్ణ్వీశులఁ ♦ బసిబిడ్డలను జేసి
ఖ్యాతి కెక్కిన యట్టి ♦ గరిత యొకతె
తనతపోవృత్తిచే ♦ యనిమిషకోటుల
భయపడఁ జేసిన ♦ పడఁతి యొకతె

తే. గీ. పార్వతికి శ్రీసరస్వతీ ♦ పడఁతులకును
గర్వభంగ మొనర్చిన ♦ కలికి యొకతె
అట్టివారలఁ దలఁచిన ♦ యంతగొప్ప
సంతసము గొల్పుచున్నది ♦ స్వాంతమునకు.

అమితకీర్తినొంది యాసేతుహిమాద్రి పర్యంతము పేరెక్కిన యానాతిమణుల జన్మమేజన్మము. ఇప్పటికాలమున వెదకినను అట్టికాంత నూటికొక్కతయైనను గానరాకున్నది.

తే. గీ. కాంతుని కడను జేరి జ ♦ గడములాడు
కాంతయొక్కతె పొరుగిండ్ల ♦ కడవసించి
పిట్టకబురులఁ బల్కెడి ♦ వెలఁదియొకతె
అత్తతో దెబ్బలాడెడి ♦ యతివయొకతె.

తల్లీ ! భారతాచలాదేవి ! నీపుత్రికలందఱును క్రమముగాఁ బెడత్రోవలంబడి పోవుచున్నారు. ఏసాధ్వి కాంతుని హృదయమెఱింగి వర్తించునో యేవనిత భర్తయే దైవంబని

భావించుచు నెక్కడవగా సపర్యలొనర్చుచుండునో యట్టియువతి జన్మ సార్థకము. తక్కినవారు జన్మించుట జననీజనకుల కష్టపు చేటు. (దిక్కులు పరికించి) ఇట్టులెంతక్రుమ్మరినను నాద్వైతము కానరాకున్నవాఁడు ముందునాగతి యేమికానున్నదో కదా ? యిప్పటికిని నాపదోద్ధారకుండను నారాయణుండే కలఁడు.

(3)

చతుర్థాంకము-ద్వితీయరంగము.

(ఋష్యాశ్రమము-అచలయోగి, సుప్రకాశుఁడు, సుమతి

ప్రవేశము)

అచ—కుమారా ! నీవన్నిటను సమర్థుఁడవైతివి కాన నీ పేరిటఁ బురంబునకుఁ బోయి నీతల్లిదండ్రుల మోదంబుఁ గూర్పుము. నేనుపదేశించిన విషయములన్నిటిని మరునక మననముఁ జేసికొనుచుండుము.

సుప్ర—గురూత్తమా ! తమరిట్లు పల్కిన నే నేమనఁగలవాఁడను.

సీ. సతతంబు శ్రీమత్పాదపద్మములు స
త్సన్నిధ్యమందుండి మీ
హితవాక్యంబుల నాలకించుచును నే
నిందే వసింతున్ ధరన్
నతలఁ గూర్పుభవాబ్ధిలో మునుఁగఁగా
నేనొల్లఁజాలన్ జుమీ

సతులంగైకొని కోర్కెఁదీర్పఁగ మిమున్
ప్రార్థింతు మానీశ్వరా.

ఈనాఁటికి నాజన్మ తరించనేమోయని తలంచుచుంటిన్
మితిలేని యానందపారావార వీచికలన్ దేలియాడు నన్ను
మరల గృహమున కేగుమని పల్కుటకు నేఁజేసిన నేరమేమి?

ఆచ—కుమారా! నావాక్యంబులను శ్రద్ధతో నాలింపుము.
నీవిచ్చటనుండుట కెంతమాత్రమును దగదు. ప్రజారక్షణా
ర్థమై క్షత్రియులు నియమింపఁబడియున్నారు. హరియంశము
చేత రాజులు జన్మింతురు. "నావిష్ణుః పృథివీపతి" యను
న్యాయమును విడనాడి, నీవిచ్చటనున్న యెడల. నీస్వధర్మా
చరణమునకు లోటువచ్చును.

సుప్ర—పరమార్థ చింతనచేఁ గాలంబును వెళ్లింపఁదలఁచిన
వానికీధర్మము లెందుకక్కఱకువచ్చును ?

ఆచ—ఎంతపరమార్థచింత యున్నను కర్మాచరణము సలుపఁ
గాని భక్తి,జ్ఞానోదయము కల్గనేరదు. భక్తికి ప్రథమసోపా
నము కర్మ మేడమీఁది కేగఁదలంచిన వానికిసోపానము లెట్లా
ధారములో అట్లే మోక్షసౌధము నెక్కఁగోరువారికి కర్మ
జ్ఞానము, భక్తి సోపానములై యొప్పుచుండును. ఋష్యా
దులంతవారు లోకసంగ్రహార్థమై కర్మలనాచరించియున్నారు.

సుప్ర—(తనలో) వీరివాక్యములను వినుచున్నకొలఁదిని
నాహృదయమున నొకవింత మార్పు కలుగుచున్నది.

తే. గీ. అగ్నిలోపలఁ బెట్టిన ♦ యట్టియినుము
వఱలెన చిత్తంబుకడుమెత్త ♦ పడుచునుండె
నీమహాత్ముని సామర్థ్య ♦ మేమొ తెలియ
రాదు నాకిప్పు తగిన కా ♦ రణమదేమొ.

(ప్రకాశము) అయ్యా! తమయాజ్ఞ శిరసావహించితిని గాని.

అచ — కుమారా! నీయోజన నాకుఁ దెలియును. నీవు పెద్ద శోకం బడుచున్నావు. అపత్నీకుఁడేకర్మనొనర్చుటకు నర్హుఁడుకాఁడు. అభ్యాగతులు మొదలగువారును తమసపత్నీకుల యింట భుజింపనొల్లరు.

సుశీ — ఆహా! ఈమహానుభావుని యుపదేశమువలన నాచెలికాని మనంబించుక దారికివచ్చునట్లు తోఁచుచున్నది.

సుప్ర — అపత్నీకుఁడైనంత మాత్రమున పురుషార్థమునకు లోటువచ్చునా? విగతలోకునకీ బంధములెందులకు?

అచ — కుమారా! ఏమంటివి? విగతలోకునకీబంధములెందుల కనియా? నీవింక నప్పుడే విగతలోకుఁడవు కాలేదు. దేవర్షి పితౄణములను దీర్పవలెను. మఱియుఁ బరాశరాదుల స్మృతులయందు మానవుని కవశ్యాచరణీయంబులని చెప్పిన విధులేవికలవో అయ్యవినీకుఁ గర్తవ్యంబులు గాన నీకును బ్రపంచకమునకును సంబంధము వాలఁగలదు. నీ వింతసంశయపడుట కేదియో హేతువుండి తీఱవలయును. (దివ్యదృష్టింజూచి) తెలిసినది. నీసంశయమును బోఁగొట్టె

దను. వినుము హిందూదేశమునకు వన్నెఁబెట్టు యువతీలలామ కాంతారత్నము నీకిల్లాలు కాఁబోవుచున్నది. కానఁ బురికేగుము. (4)

సుని—మహాత్మా! ఆమె యేరాజకుమారియో? యెక్కడ నుండెనో? తెలియఁబల్కుఁడు.

అచ—ఆమె చోళదేశపు రాజకుమారిక. మీయాగమన వృత్తాంతమును విని మిమ్మరయుచు నీ యరణ్యంబుననే యున్నది.

సుప్ర—(తనలో) ఇట్టికాంతలు ప్రపంచకమునం దుండరు కాఁబోలు.

తే. గీ. స్వాంతమునందలి వాక్యముల్ ♦ సత్యముగను
బల్కుపతియె దైవంబని ♦ భావమందుఁ
దలఁచు పతివ్రతాతతుల ♦ పలుకులౌర
వింటి నేఁడు వీనుల ♦ విందుగాఁగ.

ఈమహాత్ముని వాక్యము లమోఘములు. (ప్రకాశము) దేవా! నేఁటికి నాసంశయ వృక్షమును సమూలముగాఁ బెల్లగించినారు మీయాజ్ఞననుసరించెద. (4)

అచ—వత్సా! ఈవాక్యము నిజముకదా.

సుప్ర—హితార్థబోధకములగు తమ వాక్యములచేఁ గలిగిన బుద్ధి యెట్టివానికిని మాఱదు.

ముని—ఆహా! నేఁటికిఁగదా మాకోర్కె నెఱవేరెను.

అచ—ఆనందము.

సుప్ర—గురువరా ! మాకు సెలవొసంగుడు.

అచ—వెళ్లుడు. త్రోవలో కడు జాగరూకులై యుండవలెను.

సుని—చిత్తము.

(నిష్క్రమింతురు)





# సంగీత పుష్పవేణీ నాటకము.

:o:

## పంచమాంకము.

### రంగము అరణ్యము.

(సుప్రకాశుండు - సునీతియు - ప్రవేశము)

సుప్ర—మిత్రమా! పాపమాకాంత యరణ్యములో నాకొఱకు వెతలంగుందుచు నెయ్యెడదుఃఖించుచుండెనో కదా? నేనన్నికష్టంబులనైన భరింపనేర్తును గాని మొఱులతనాకై కష్టముల పాలగుచున్నారని విని సహింపఁజాలకున్నాను.

సుని—అగును మిత్రమా! నీమానసము నవకోమలముగదా

సుప్ర—అది యేమి నీహస్తమందున్నది?

సుని—ఇదియొక చిత్తరువు. చూడుము (చేతికందిచ్చును)

సుప్ర—(చూచుచు) ఏమి యీలోకోత్తరసౌందర్యము ఔరి కాఁడా! దీనిని నీవెక్కడనుండి సేకరించితివి? ఎవ్వతె యీ యబల?

సుని—ఏయబలాలలామను నీకుఁగూర్ప విజాజనకుండు సిద్ధపడెనో యేరమణీశిరోమణి నీకొఱకై తండ్రితోఁ బాత.

గించి యీకాననాంతరంబుల పాలయ్యెనో యట్టిచోళ దేశపు రాజకుమారి పుష్పవేణి.

సుప్ర—ఏమి! ఈమెయేనా! పుష్పవేణి? ఏమియీసౌ మ్యాకృతి. (1)

తే. గీ. స్వాంతమందలి సద్గుణ ♦ సమితిఁదెల్పు
కలికిరూపంబు సమ్మోద ♦ కరముగాదె
సకల శుభలక్షణంబులఁ ♦ జాటుచుండు
చూడ్కులద్దిరా హృదయమున్ ♦ జూరఁగొనెనె.

ఇదివరలో దీనిని నాకేలఁ జూపవైతివి?

సుని—చెలికాఁడా! దీనిని నీకిదివఱకే చూపించియుంటిని.

కం. నిరుపమవైరాగ్యంబున
వరలెడు స్వభావమునకు ♦ వరచరితా చి
త్తమువే దోఁపఁగ లేదిక
పరయోగాఁ జిత్రమెద్ది ♦ యవనిస్థలిలోన్.

మీజనకుం డెంతనెక్కుపక్కాడించినను జవిం జెట్ట వైతివి నేఁటికామునీశ్వరుని దయవలన మేము ధన్యులమైతిమి.

సుప్ర—మిత్రమా! ఈమెయేయా! నాటి రాచకన్నియలలో నెల్ల శిరోరత్నమని వన్నెకెక్కినది?

సుని—ఔను నీవన్నది సత్యము. (2)

(అనినిష్క్రమించుట తిరిగి ప్రవేశము)

సుసి—(చూడ్కిసారించి) వయస్యా ! అదిగో యొకఘోరం సర్పము. విసము గ్రక్కుచు నిటువచ్చుచున్నది.

సుప్ర—అగునా ? ఏమిది సమీపించినకొలఁదినిఁ గన్నులు మూఁతలువడుచున్నవి. కరవాలంబును జేతధరింపుము.

సుసి—కరవాలము కరమందున్నది. కాని కన్నులు తెరపిసిఁ బడవయ్యెను. (సర్పము సుప్రకాశునిఁగఱచి పాఱిపోవును)

సుప్ర—(పడిపోవుచు) హా ! హాతోస్మి. మిత్రమా ! సుసితి ! నన్నీ దుష్టభుజంగంబు కఱచి మాయమయ్యెను.

సుసి—(కన్నులు తెఱచి) మిత్రమా ! ఏమి యీ యకాల విలయము.

సుప్ర—సఖా ! నన్ను సర్పము కఱచినది నా కేమియో నోట మాటవచ్చుట లేదు. కన్నులు చీఁకట్లు గ్రమ్ముచున్నవి. నా ప్రాణంబులు నిలుచునట్లు లేదు. నీవునన్ను వదలి మదీయ జనకుని కడకేగి నాతల్లితోడను గురువులతోడ నిట్లు పల్కవలెను.

సీ. గురువరతమయాజ్ఞ ♦ నెఱవేర్పఁజాలని
వ్యర్థుఁడౌ సంగాడి ♦ వందనమును
జనకాజ్ఞజవదాఁటి ♦ దానలేనికడగండ్ల
నందిస్వర్గంబును ♦ బొందెననుము
నా నేరములఁగాచి ♦ నాతుదివందనం
బందికొమ్మనుచు నే ♦ నంటిననుము

నవమాసములుమోసి ♦ నన్నుఁగన్నట్టి నా
తల్లికిఁబుడిసి వం ♦ దనములను [illegible] దేవ
నాదుగురులకోఁబల్కుము ♦ సాదరముగఁ [illegible]
జోళరాజపుత్రికతోడ ♦ సుదతిని క
కారణంబుగనిచ్చితిఁ ♦ గష్టములను
గాన మన్నింపుమనుము నా ♦ ప్రాణసఖుఁడ.

మఱియు నాతల్లిదండ్రులకు నీవేతనయుండవు. హా! ప్రాణేశ్వరీ! ఘనసమవేణీ! పుష్పవేణీ! ఎట్లయినను నీయరణ్యమంతయు వెదకి నిన్నుఁ గనుఁగొనవలయుననియె తలంచితిని. కాని యిట్లగుదుసని తలఁపనైతిని (3) నీవొకవేళ వన్యమృగముల కాహారమనైతివేమో అట్లయిన నన్నిదే కలియవచ్చుచుంటిని. మిత్రమా! నాతప్పులను మన్నింపుము (4)

(మృతిపొందును)

సుని——(విచారముతో) హా ప్రాణసఖా! నన్నొంటిగ విడిచి నివేగన్యాయమా! నేఁజేసిన నేరమేమి? దైవమా! అతులితభూతదయాన్వయుఁడే. కలఁడయినఁ బరస్త్రీలను గాంచని సత్పురుషుఁడే. యనుపమాన సౌందర్య విరాజితయగు కాంతామణిం జూపినను జేకొనన్నొల్లని జితేంద్రియుఁడే యట్టివానికీ యాపదరాఁజెల్లునే?

సీ. జనదాతనెఱుఁగఁడే ♦ సన్మార్గసంచారి
గఁగునచస్థితధర్మ ♦ సరసనెప్పుడు

దూషించిమెఱుఁగఁడీ ♦ దోర్బలోన్నతుఁడు పె
ద్దలవాక్యములసున ♦ న్వ్యాలకునైనఁ
జంపించిమెఱుఁగఁడీ ♦ సత్పురుషుండు తా
నపరాధులనునైన ♦ నవనిలోన
చిన్ననాటనుబోలెఁ ♦ జేడియలన్నచోఁ
జూడఁగనొల్లని ♦ శుద్ధచరితుఁ
డక్కటా యిట్టిదురవస్థఁ ♦ జిక్కె ధరణి
నికఁగర్తవ్యమెద్దియో ♦ యీశ నాకుఁ
బ్రాణముసకుఁ బ్రాణంబౌచుఁ ♦ బరగుసఖుఁడు
పోవఁగాంచియుబ్రదికితి ♦ మొండిబ్రతుకు.

నెచ్చెలీ ! ఇంటికరిగిన నిచెలికాఁడు సుప్రకాశుఁడేడి యనియడిగిన నేనేమనిపల్కుదును ? నిన్ను వన్యమృగంబుల పాల్పఁబెట్టనా కొనివచ్చితిని? హరియంశచే జన్మించినసుపు చిరంజీవి వగుదువనుకొంటినిగాని యిట్లకాలమృత్యుదేవతా కరాళదంష్ట్రల కాహారంబవగుదువని తలంపనైతిని. (ప్రక్కను జూచుచుండి) హా ! దయార్ద్రహృదయా !

సీ. భూపాల సుతులునిన్ ♦ బొగడంగవచ్చిరి
మూడవేటికివారి ♦ శుద్ధచరిత
మోహనాకారసి ♦ మోముఁజూడఁగవచ్చు
తండ్రియార్తినిఁదీర్పఁ ♦ దలఁచిరావె
కాంభోజరాజునిన్ ♦ గానఁగవచ్చెని

వెమరుగాంచోవేల ♦ సదయహృదయ
కళ్యాణి యాచోళ ♦ కాశ్యపీశ్వరసుత
కనవచ్చె నిన్నదే ♦ కనవదేల
త్రోడికొనిపోవదేలని ♦ త్రోడనన్ను
నే నీకెట్లుందు నొంటిగ ♦ నిన్నువిడచి
భైరవీసమమీతల్లి ♦ పరమచరిత
కేమిచెప్పెదం పెదవ్రుకో ♦ యొంచిచూడ.

హా సుప్రకాశా!

(ప్రవేశము—పుష్పవేణి)

(5)

పుష్ప—ఎవ్వరో నానాథునిఁ బిలచి పేర్కొనుచున్నట్లు వినఁబడినది. ఆవృక్షముక్రింద నెవ్వరో యిద్దరు పురుషులున్నారు. ఆకూర్చున్న వానిని సమీపించి విషయ మరసెదఁ గాక.

సుని—ఆవచ్చున దెవరు? పుష్పవేణివలె నున్నదే పటంబునకు నామెకు నించుకేనియు భేదము లేదు. ఇట్లొంటిగ నీయరణ్యమునకుఁ జేరి యిటకువచ్చుచున్నది. ఇప్పుడేమని పల్కుటకు నోరాడకున్నది.

పుష్ప—అయ్యా! తమదేయూరు? ఏటికిట్లు విచారించెదరు?

సుని—(తనలో) ఇప్పుడేమనిపల్కుటకు నోరాడకున్నది. (ప్రకాశము) అమ్మా! మాళవదేశాధీశ్వర సుతుండగు సుప్రకాశుని చెలికాండను. నాపేరు సునీతియందురు.

పుష్ప—తమవిచార కారణమేమి ?

సుని—(చిన్నకుంటును)

పుష్ప—అయ్యా ! తమరట్లూరకున్న కొలఁదిని నాహృదయ మేలయో చేయిపెట్టి కలఁచినట్లున్నది. వారట్లు మూర్ఛను మునింగియున్నట్లున్నారేమి ?

సుని—(తనలో) ఇఁకదాచిలాభమేమి? (ప్రకాశము) అమ్మా! వినుము చెప్పెదను.

తే. గీ. తల్లిదండ్రుల కొక్కఁడే ♦ తనయుఁడగుచు
జనులకెల్లను గన్నుల ♦ చందమామ
యైన మాసుప్రకాశుఁడో ♦ యబలమున్నె
వీడి దివమును జేరెను ♦ విధికృతంబు.

పుష్ప—(హాయనిమూర్ఛిల్లును)

సుని—ఎంతకష్టము.

పుష్ప—(తెలివిఁదెచ్చుకొని) హానాథా! శిరీషకుసుమకోమల శరీర ! నన్నిట్లు దిక్కులేనిదానిఁగాఁ జేసి నీవేగ నీ వియోగం బెట్లు సైరింతును ? మనోహరా ! నీకై కదా తండ్రినివిడనాడి తల్లినివదలి బాంధవులనుత్యజించి యైశ్వర్యమునువిసర్జించి ఈకాఱడవులవెంట బయలుదేరుట. అట్టి నాపైఁగరుణను వీడి పోయితివా ! (సునిఁగాంచి)అయ్యా ! మరణకారణమును వివరముగాఁ బల్కుఁడు.

సుని—తల్లీ ! సర్పదష్టుఁడగుటయే కారణము.

తే. గీ. నిఖిలశాస్త్ర పురాణేతి ♦ హాసములును
నీదుచారిత్రము లేకద ♦ నీరజాక్షి
వినుచు గనుంగొంటి ధన్యనై ♦ తిని జగతిని
నీపదములకు మ్రొక్కెదం ♦ బాపనాశ.

దేవా! సర్వజ్ఞుండవగు నీకు నాకోర్కె యేమో తెలియదా.

విష్ణు.—సంతసించితిని. నీకు నీభర్త నొసంగితి. నీకీర్తి యాచంద్ర తారకముగా నుండుంగాక (సుప్రకాశుని బ్రదికించును)

సుప్ర—(లేచి) యెంతనిద్రపోయితిని. ఏమిది జగన్నాథుని దివ్యమంగళవిగ్రహమువలె నున్నది. ఈకాంత యెవరు! నామిత్రుండిక్కడ నేయున్నాండు. అన్నట్లు మరచితిని. సర్పదష్టుండనై మృతినొందిన నేనెట్లు బ్రతికితిని.

విష్ణు—కుమారా! విశాఖుం డెందకును.

సీ. సుదతులం దెనగిమును ♦ జూడ నొల్లక
వనముల కేగిన ♦ వాండవిప్ర
నీతో మునీశ్వరైయె ♦ నివెంటనంటిన
నీతివంతుండను ♦ నీతియుతుండ
మీచరిత్ర నెఱింగి ♦ మీకు మేలొనగూర్ప
నరుగుదెంచినయట్టి ♦ హరిని నేను
నిన్నుదైవంబని ♦ నెమ్మది భావించి
వనమున కరుదెంచి ♦ వంతలంది

తే. గీ. బాలికలకబ్బుఁగాక్రొత ♦ పరమభక్తి
భర్తలందుసత్కళలతో ♦ వరలుఁగాక
వసుధలోపలబాలికా ♦ పాఠశాల
వృద్ధిపొందునుగావుత ♦ వేడ్కమీరఁ.

విష్ణు—తథాస్తు (మంగళము) (10)

సంగీతపుష్పవేణీనాటకము.

సమాప్తము.





# ఈ నాటకమునందలి పాటలు.

నాటకారంభమున బాలికలందరు కలసిపాడునది.

కల్యాణి—ఏక,

శ్రీకర కరుణాకర-సేవిత సురగణ-దేవకీనందన-గోపాల ॥
పరమపురుష - సారసాక్ష హరి - పాలితసురలోక - రక్షక -
పరమకృపను జూడుము మాధవ ॥ (శ్రీ) ॥

చ॥ సినుంగనుంగొన - దేవతాళికిని - సాధ్యముగునె - సి
తవర్ణ-సమ్యక్-శంక-నేరని బాలలన్ గను ॥ (శ్రీ) ॥

ప్రథమాంకములో

1 వ గుస్తు (పుష్పరథుండు)

ముఖారి—ఆట

అకటా నేనీ యాపద - నెట్టుల - సుకరంబుగ దాటు
దనో జగతీ ॥ కలికిరో నేనీధర - కలుషితుండనో వేమో-కమల
నాభునకును - కరుణరాదయ్యో నాపై ॥

చ. సుతులు లేని-నరుగతి నరకమేయని-సుజనులు
బల్కు-చుండ్రు క్షితిని నాగతి యేమో ॥ అక ॥

2. వ గుర్తు.

హిం—తోడి—రూపకము

సుశీ—ప్రాణకాంత - మిమ్ము బాసి - ప్రాణంబుల - నిలుపు
కెట్లు ॥ ప్రా ॥
నిన్ను వీడి- నేభువిని- నిముసమైన- తాళగలన- నివెంటనె-
యరుగుదెంతు ॥ ప్రా ॥

పుష్ప—బామన్నా[illegible]- [illegible]టవినవె - త్వరితంబుగ - వెడల
నిమ్ము ॥ బామ ॥
ఆతయు వినియుండి నీవు - మంతనమున-దిగులునొంద-
నింతినీకుదగదనుమ్ము ॥ భా ॥

సుశీ—ఆహా నా ప్రాణనాధ - మోహాబ్ధిని- గ్రోసెదవా॥ ఆ॥
శ్రీహరిపదములనునమ్మి - గేహంబుననుండజాల సాహస
మునవత్తునుడీ ॥ ఆహా ॥

పుష్ప—గిరిధరుని-నమ్ముమబల- నిరతము - కృపజూచు
నతండుగ॥ కరుణాశోధుం - గాచునతండు కలికిరామునపాలరి
గిలంచు । సురవినుతుని వేడుమబల ॥ గ ॥

3. వ గుర్తు

జింగ్లా—ఏక

పుష్ప—చెలియరో నేనేగుచుంటిన్ । కలవరము దకో । కంజ
దళాక్షి । కమలాధిపుదయం । గాంచెదను నిన్నుటన్॥

సుశీ—నాదా ! మిమ్మొడ బాసియునేనిట । నిలువగంగలనా
నిరతము[illegible]హామున । ననుగొనిపోవగం నాధా ప్రార్థింతున్॥

పుష్ప—సుతహీనుడనై। సుదతిరొనుంటు। జూడఁగమదికిక్
వెతగాదోచెన్। సుమశరీరాననుబంపుమా పోదుకా

పుకీ— సరిమిా శేగ వి - చారమున మునిఁగిదరిగానకె నే - నా
మనోనాయక। గరళమ్ముమ్రింగెద కరుణ జూడుమా॥

ద్వి తీ యాం క ము

1. వ గుర్తు ప్రియంవద

హిం—శో కి—ఏక

కనుగొనుమా చెలికన్నులకింపగు। క్షోణీశశ సుతుల
పటములన్॥

వీను శిరోయూతఁడు - పాండ్య దేశపు రాజకుమారుఁ
డాడఁగదే। లలనావరియించెదవే చెపుమా

2. వ గుర్తు.

కన్నడ దేశాధిప - చిత్తరంజనుగాంచుమా ..
మారియిాల్। కలికీయితనిన్ వరియించెదవే॥ క॥

3. వగుర్తు.

కాసీపురాధీశ్వర సుతుఁడితఁడు - కంజదళాక్షిరో కన్గొ
నుమా। వసంతాక్షపసుందరుడీతఁడు॥ క॥

4. వ గుర్తు.

మదనతి మహాసుకుమారుని గాంచుము-మానిని కోసల
జసుతున్। మగువా మహనీయుండీతఁడు॥ కను॥

### 5. వ గుర్తు.

(ప్రియంవద) కమాచి—ఏక

కాంతా ! చిత్తంబున్ [illegible] । కనుమా ।
చెలియా । కనులారదీని ॥ కాం ॥

వలపించు- లలిమించు- కలగించు-చిత్తంబున్ ॥ కాం॥
సరసంబు - పరువంబు - ప్రాయంబు - ధరనింపు ॥ కాం ॥
క్షితిపాంళవేశ - సుతచిత్తమించు సతింగోచెనాకు
నిటుజూడవమ్మ ॥కాం॥

### 6. వ గుర్తు.

హిం—కాపీ—ఏక

పు. వే.—ఆహాహాజనక సివిపుషనాతో । యేలపంతమాడెదవు॥ ఆహా! [illegible]ముఖులవాలు । చూపులబారినిబడిం మోసపోవని పురుషవరుం । డెవ్వండిధరన్ ॥ ఓహో యేలపంతమాడెదవు ॥ ఆహా ॥

పుష్ప—నారీ నీవేలనా । నవమోహనాంగు । చూచియు నాస్వప్నమోడెదో ॥

పు. వే.—ఓహో యూతని సౌందర్యమింతయో ।

పుష్ప—అలవానిఁ బోలునా యింతేడేజగాన । మాటవినుమా॥

పు. వే.—మనవివినుమా । ఓహో యేలపంతమాడెదవు ॥ ఆ ॥

### 7. వ గుర్తు.

హిం—[illegible]—ఏక—పుష్ప వేణి.

మనుజవరా నామనవిని వినుమా । మనసునఁదలఁచిన మగనిని విడువను ॥ మ ॥

అన్యులనివరియించుట । మానవతుల । కవనిలోధర్మము కాదుసుమా । అవనీసుర నాపలుకులంగైకొను ॥ మ ॥

8. వ గుర్తు.

నవరోజు — ఏక.

ఇందిరా హృదయలోలా । వందనంబున్ గొనుము చాలా । ఇం॥ నేమనమునన్ - నినుదలంతున్ । నీరజాక్ష । నిర్మలాత్మ ॥ ఇం ॥

సతతమీవే । గతియనుచువే । నతులనస్మితి సతిమొనర్చితి ॥ ఇం ॥ తృతీయాంకము.

1 వ గుర్తు సుప్రకాశుఁడు తోడి-ఏక

ఆహాశంకర దీనజనావనాశ్రితాంరభయంకర । భవబంధన మోచన స్మరహరనా । యికనీయిడుముల నేనేగతిభరియింతు ॥ఆ॥ కటకటా! నన్నికష్టంబులకును! గాసిలుమనుచును లిఖియించితివే । గరళధరా శంకరకరుణింపుము కల్మషహర । సంభోసుర । వైరిహరణా । హరగిరిజాబంధో॥ ఆహా ॥

నినుసేవించెడి జనములకును భువి - నిఖిలసుఖంబుల నిచ్చెదవనుచున్ । విని నేత్రికరణ । శుద్ధిగనిన్మది । భావించితి । యీపన్నుడ గంగాధరహర హరశంభో॥ ఆహా॥

2 వ గుర్తు.

బేహాగ్ - ఏక - (సుప్రకాశుఁడు.)

ఆహానన్నింక । మన్నింపుమా । ఓజనకా । నామాట లాలింపుమా॥ కాంతతోడన్ । కాలమున్ గడుప । స్వాంత

మొప్పదమ్మోన్ । కోపంబుఁ । జెందకుమా నాపై జనకా ।
మాటలన్నివినుమా॥ ఆహా॥

3 వ కుర్తు.

హిం-కాపీ-రూపకము-సుప్రకాశుఁడు

నారాయణ - నారాయణ - నారాయణ - నారా
యణ - నారాయణ-శ్రీ॥ నారాయణ। నీరజాక్ష పరమపురు
ష । నిఖిలేశ్వర । శ్రీకరా । నీరదాంగశోకి॥ నారా॥

వారిజానేత్ర । జనకపద్మభవశంకర । వినుతనామ॥ పర
మేశ్వర । శాప్రమా। నా।

చతుర్థాంకము.

1. వ కుర్తు (పుష్పవేణి)

హిం - కన్నడ - ఏక.

ఆహానాథా । అటవీస్థలిలో అకటాఎందేగితో । ఆహా
దైవనారాయణులుఁ । జేసెగా యికేగతి॥ ఆహా॥

కరుణలేక కఠుకృాఱుండై దైవంబిటుఁజేసెఁగా । ధరణి
లోసనేదివెరపు । దలంపఁగా హరీ॥ ఆహా॥

2. వ కుర్తు.

(పుష్పవేణి) ధన్యాసి - రూపకము.

ఇదిధరణిని యెన్న రాని ఘోరము। ఈశ్వరాచూడగా॥ఇ॥
చూ చెడివారెవరులేక బ్రోచెడివారెవరులేక నొంటినున్నదాన
నైతి హా॥ ఇది॥

పతినిగాంచలేక యిటుల బాధలనొందితినిగా । పరశివ నానుమట నెటుల వ్రాసితివో హా శంకరా యిక హా॥

చతుర్థాంకము.

3. వ గుర్తు - పుష్పవేణి.

బేహాగ్-ఏక.

పరమనామ । నిరుపమాన । సుందరధామా । నిగమ గోచర । కొరతదీర్చుమా । పరమపురుష । సురగణనుత । రజతశైలవాసా । వరమీయుమా । దయగనుమా । తేజమిమ్మా । ధననుత॥ ఓ॥ ప ॥

4. వ గుర్తు - సుప్రకాశుడు.

సింధుకమాచిరాగము - రూపకము.

మానివరమా మనవిన్ గైకొనుమా బల్కెదన్ । మన్ననలనొసంగుమయ్యా మానికులభూషణా॥ మా॥

సంశయహీనమయ్యె - సంయమీంద్రమది - సంశయం బేలను మీయాజ్ఞ బాలించెదన్॥

పంచమాంకము.

1. వ గుర్తు.

కళ్యాణి - ఏక - [సుప్రకాశుడు]

ఆహా ఆహాయింతీ । అమరేశునియింతీ । యాలరు విల్తు చేతిబంతి॥ ఇందువదన మోహారా చందమునిబోలు। కన్నుల తీరు కమలములను బోలియుండు॥ ఆహా॥

వనితాసుందరా । కృతిరమణీయం । బెదకానందమ య్యోగ గనగ॥ అ॥

## 2. వ గుర్తు.

### పీలు - ఆట.

పుష్ప వే — వనదేవతలారా । మనుజేశుగాంచిరే కాననము
లోన । కడగండ్లనందిన॥ వన॥

సుప్ర — నదులారా పొదలారా । మదమత్తేభములారా । మ
దవతినిమీరు గాంచియున్నారే॥ నదు॥

పుష్ప వే — సురలారా । గిరులారా। తరుసమూహములారా ।
ధరణీశుగాంచిరే । ధరలోనమీరలు॥

సుప్ర — మునులారా । గుహలారా । వనమయూరములార ।
మనమును గొనినట్టి కనకాంగినిమీరు॥

పుష్ప వే — కవిసమూహములారా । ఘనహర్యక్షములారా ।
త్వన్నాథునిమీరు కాంచియున్నారే॥

సుప్ర — శుకశారికములారా । మృగసమూహములారా ।
అకలంకమైనట్టి యతివనుగాంచిరే॥

## 3. వ గుర్తు సుప్రకాశుడు.

### ముఖారి — ఏక.

హా ప్రాణనాయకీ । హా మనోహారిణీ। హా కుసుమాంగిరో
హా యెటనుంటివో॥

భామరో నిన్నిల। బాధలఁబెట్టిన। పాతకునై తిని। బడఁతిరో
నీతోడ ॥ హా ॥

వనితరోయిమమల। బాలికిగురికై ప్రాణముల్బాసితో॥
వార్తలేమోకదా ॥

4. వ గుర్తు—సుప్రకాశుఁడు.

జింగ్లా—ఏక

ప్రాణసఖా ! పోదున్ - సెలవొసంగుమనా । ఇదెతుది
చూపుగా । మదినిదలఁపుము ॥ హా॥

సతతమునన్నే । గతియనుపితలను। జేరగబోనిక॥ ప్రా॥

నిరతము నీయెడ। నేఁజేసినయా। నేరములెంచకు॥ ప్రా॥

5. వ గుర్తు.

తోడి—ఏక—పుష్పవేణి.

హా। యిక నెటుసైతు జగదీశ్వరా । ఓకలుషహరా ।
బ్రోవరా ॥ యికనో॥

చ. నీరజాక్షు నిఖిల భువన స - న్నుతా

శివార్చితా రమేశ్వరా । జగదీశ్వరా ॥

6. వ గుర్తు.

తోడి—ఏక

స్వామీ ! కృష్ణా వరమునీయుమా

పంకజాక్ష.నా। పరితాపమును। బాపవేర॥ శ్రీమనోహరా॥

ధనుజహరా నా । ధవునొసంగి । దగబ్రోవవేర ।
నళిననాభ ॥ స్వా ॥

7 వ గుర్తు.

(పుష్ప—[illegible]ప్ర—సుని)

తోడి—ఏక.

సురేశా సుప్రకాశా శ్రీరమేశా సూర్యచంద్రాక్షా॥
మహేశా । మంగళాంగా మారజనకా । మాధవా ॥ దేవా ॥

పంకజాక్ష భక్తవరదా । పాపసంహారా । సురేశా।
భక్తితోనే । భావమందున్ భజన జేసెదము ॥ హేవరదా॥సు॥

నిన్ను నమ్మి యుంటిమయ్యా నీరజనేత్రా । మురారీ
మోహసంహారీమముదయన్ బ్రోవవారా వా ॥ సు ॥

{ పుష్ప వేశి—8 వ గుర్తు.
{ సుప్రకాశుడు—

బేహాగ్—ఏక.

పుష్ప—నేరంబు మన్నింపుమా । ప్రాణనాథ । నీకెంతో నయ్యం
బిలన్ । జూడనైతి । శరణంటినన్గావుమా ॥

సుప్ర—నన్నిటు వేడ నేల—చాలు బాల। మన్నన కేమింజేసెవలనను
మమతను వీడకుమా ॥ న ॥

పుష్ప—మీ కేలుబూనంగ నా । వల్లకానె । సతులెన్నదీ
ముఖులౌ మీశక్తినెల్ల । కొనియాడక నాతరమా । కోమ
లాంగ ॥

సుప్ర—నిన్నెడబాయంజాల। నీరజాక్షి। నీవంటికాంతామణుల్
కలరెభువిని । నన్నేలుకొమ్మా సతీ ॥ ప్రాణసఖి ॥

సునీ—ధన్యాత్ములారా ! మిముఁ జేలోకమందు సరిపోలు
వారెవ్వరో పుష్ప వేణి ! ...పునీతవేకదా ! తల్లినీవు॥
విష్ణు—మిముగాంచ మోదంబఱ్యోన్ ! భక్తులారా॥ మీకిష్ట
ముల్దీర్పగా కోర్కెఁగల్గె పావనమాగాదె మీసేవ్యులము ॥

9. వగుర్తు విష్ణుమూర్తి.

ఆనందభైరవి—ఆది

కుమారినినుభువిలో । కొనియాడ నాతరమ । తలఁచరో రాజ । కుమారిధరనీ సమానులేవరిక । నోమందగమన పుష్పవేణియోరాజ । కు॥ పుట్టినయింటికి మెట్టినయింటికి నిట్టి సత్కీర్తిని దెచ్చితివో రాజ ॥ కు ॥

10. వగుర్తు. మంగళము.

తోడి—ఏక.

మంగళంబుగొను । మనసిజజనకా । పరాత్పరవరద కృపాకరా । సరసిజదళలో.। చనముర సంహారి । ధరణీర మణాకలుష విదారణ ॥ మం ॥ నీలదేహా నిర్మలాత్మా పరమ పురుషాకారా । బాలలమగు మామనవినిగైకొని దయన్ గొనుము శుభహారతీ ॥ మంగళ ॥

కోలాటపు పాట.

హిం—కాపీ—ఏక.

రారేదశరధతనయుని । సేవకురమణుల। మందరమున్ గూడుక రయమున పూలతో పూజింతము ॥ రారే ॥

సరసిజదళలోచను మనమునప్రేమ । మనంబునను సీతా కాంతుని భక్తితో భజింతము సతులారా వేగమె ॥ రారే ॥

ఇహపరసుఖముల నిచ్చెడి ప్రభువై దాసజనంబుల కల్ప భూజమై । ఘనతరుడీరాముని దలంచి పాడఁగను ॥

పరమపురుష గోవిందమురారీ సరసిజనాభ జనార్దన శౌరి । నరహరి యనుచును దలంచి పాడఁగను ॥ రా ॥

తండ్రి శ్రీరాముఁడని తల్లి సీతయని దలంచి భజింతము తరుణీ మణులారా । నిరంతరానందంబు కలుగఁగను ॥ రా ॥

## మార్చింగ్ పాట.

నవరోజు — ఏక

బాలలారా మనమిప్పుడు - కడు నేర్పుతోడను కూడుకుని । మార్చింగ్ చేయుదమిటు రండోహో ॥

కన్యలారా ! శ్రీపతిని - కడుభక్తితోడను కూడుకుని యాడుచు పాడుదమిటు రండోహో ॥ బా ॥

## విజ్ఞప్తి.

బాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయులెవ్వరైన నీ నాటకమును తమబాలికలచేఁ బ్రదర్శింప నెంచి యపేక్షింతురేని నేను నాచేతనైనంత సాయమొనర్పఁగలవాఁడ.

ఇట్లు,

గ్రంథకర్త.

# ఆంధ్ర విద్యానిధి సంఘము.

## The Andhra Education Society.

**1913 సం|| స్థాపితము.**

అధ్యక్షులు మా. బి. నరసింహేశ్వర శర్మగారు.

### ఉద్దేశములు.

౧. ఆంధ్రుల స్త్రీపురుషుల ప్రాథమిక మాధ్యమిక ఉన్నత విద్యల వ్యాప్తికై పాటుపడుట. ౨. ఉన్నత విద్యాశాఖల లో నభివృద్ధి తక్కువగ నున్న (ఇంజనీరింగు, వైద్యము మొదలగు) శాస్త్రములందు విద్య నభ్యసించెడి విద్యార్థులకు ధన సహాయమును జేయుట. ౩. ఆంధ్రదేశమునకొక విశ్వవిద్యాలయము లభించుటకై ప్రయత్నించుట.

### విన్నపము.

దానములయం దుత్తమదానము విద్యాదానము.

మహాశయా! ఆంధ్రులు వారియుత్సాహమునకు తగినరీతిని కార్యనిర్వహణ సామర్థ్యమును జూపకుండుట సంతాపకరము. దేశమునందు నూతనోద్యమములు పుట్టుచున్నవి. యువజనులందమితోత్సాహము గలదు. గాఢమైన సేవాభిలాష గలదు. దేశమునందు మండలసంఘములు - శాఖాసంఘములు గ్రంథాలయసంఘములు స్త్రీసమాజములు దేశక్షేమమునకై పని చేయుచున్నవి. సభలయందును సమాజములందును చేయబడిన తీర్మానములు లాచరింపబడనపుడు వానివలన ప్రజలకు విశేషమైన లాభము కలుగనేరదు. జను లందరును తలపెట్టిన కార్యములను నిర్వహించుటకై పాటుపడుట శ్రేయము.

[illegible] 1913సం॥ నందు స్థాపింపబడినది. సంఘో [illegible] విశేషమైన యుపయోగము [illegible] కారణము ధనలోపము, సేవకాభావము.

[illegible]! విద్యానిధికి యథాశక్తిని తాము [illegible] చేసియు ఇతరులచేత చేయించియు సోదరీ సోదరు [illegible] విద్యాదానము చేసి మాతృదేశారాధనమును జేయుడు. [illegible] చేయవచ్చును. సంవత్సరాది, దినమునందే [illegible] సహాయము చేయవచ్చును. ప్రతివారును [illegible] శక్తిని సహాయము చేసి విద్యాదానము చేయుటకు వేడు చున్నాము. తాము చేయు సహాయము స్వల్పమైనను విశేష ముగ నెంచి స్వీకరించుదుము.

1. ప్రధానపోషకులు :—విద్యానిధికి రు 1000 లకు తక్కువ కాని ద్రవ్యమునిచ్చువారు. 2. పోషకులు:—రు 100 లకు తక్కువ కాని ద్రవ్యము నిచ్చువారు. 3. సభ్యులు:— సం 1 కి రూ 1-0-0 తక్కువకానిచందా నిచ్చువారు. 4. అభిమానులు;—యథాశక్తినిధర్మమునిచ్చెడివారు. 5. సంవత్సరాదిభిక్షులు.

ఇట్లు విధేయులు, సంయుక్త కార్యదర్శులు.

పండిత వి. గోపాలాచార్యులు, కాశీనాథుని నాగేశ్వరరావు.
వేమవరపు రామదాసు,

సొమ్మును పంపుటకు చిరునామా, ఆంధ్రవిద్యానిధి కార్యదర్శి.
7, తంబుశెట్టి వీధి, మద్రాసు.